సవ్యసాహిత్యమాల



సంపాదకులు:

విద్వాన్ విశ్వం

టి. నాగిరెడ్డి

తరిమెల

పామిడి పోస్టు

అనంతపురం జిల్లా

# ఇదోండి! 3

మా నవ్యసాహిత్యమాల రెండోవిరి వికసించింది. సౌరభాన్ని నలుమూలలా వ్యాపింప జేస్తుందనే ఆశించడంలో స్వార్థమేముందీ?

లోకాన్నంతా ధ్వంసంచేసే వినాశక శక్తులన్నిటినీ యెదురొడ్డని, సమసమాజాన్ని నిర్మించి, మార్క్సు తత్త్వంలోని మహిమను చూపించిన మహానుభావుడు లెనిన్.

అతని జీవితం సంగ్రహంగా యిందులో చవిచూపబడినది. అతడొక మానవుడుగా గాక నాయకుడుగా చిత్రితుడైనాడు. ఆంగ్లములోని చాలా పుస్తకాలు వస్తు విషయంలో సాయపడినవి. వానిలో డి. యస్. మిర్స్కి పుస్తకము దీనికి మేలిబంతి./ వారికి వందనాలు. లెనిన్ తత్త్వాలను వివరించడానికి యిందులో యెన్ని పేరాలో వినియోగపెట్టినా ప్రయోజనం తక్కువ. ఒక మిత్రుడన్నట్టు తెలియనివారి కర్థముగావు. తెలిసినవారికి యీకొద్ది సవరణతో లాభంలేదు. అందుకోసం ప్రత్యేక పుస్తకమే ప్రకటించ దలచినాము.

విషయ సంగ్రహణంలో వేడుకపడుతూ సాయముచేసిన మారాజు మా "రాజు". ఎంత మావాడైనా కృతజ్ఞతైనా తెల్పకపోతే బాగుంటుందా?

నిండా మునిగినాము చలేమి గాలేమని, నూరుపేజీలపైగా పుస్తకం పెరిగినా అర్ధరూపాయే వెల ఉంచినాము. పీచుకాగితాలు వేయమని చాలామంది సలహా. కానీ మామనసొప్పలేదు.

అనుబంధాలుకూడా యింక అట్టే వేస్తుంటాము. ఒక మారు చదవరూ?

ఆంధ్రలోకమే అభిమానిస్తే యెంత సారస్వతమైనా నంతరింపవచ్చు. అంతమాత్రం ఆదరింపక పోతుందా?

---

# 1

అది 1870 సంవత్సరం ఏప్రిల్ నెల 10 తేదీ. ఒక్క రష్యా చరిత్రలోనే కాక ప్రపంచ మానవచరిత్రలోనే స్వర్ణాక్షరాలతో వ్రాయదగిన దినం.

ప్రపంచమంతా పరిపరివిధాలా పాడై పోతుంటే, నిరుద్యోగమూ నిరుపేదతనమూ నీరసపరుస్తుంటే, జారు ప్రభుత్వంతో రష్యా నిరంకుశచర్యలకు ఆహుతి అయి పోతుంటే, ఉద్ధరించడానికై పూర్ణ తత్త్వ స్వరూపంవలె మన నాయకుడు,

లెనిన్

ఉద్భవించినాడు.

అది వోల్గానదీ ప్రాంతం. సింబర్స్కు పట్టణం. ఆ ప్రాంతానికంతా స్కూళ్ళ ఇన్స్పెక్టరు లెనిన్ తండ్రి. తల్లి మేరియా. వీరి సంతానమంతా పక్కా విప్లవకారులే. లెనిన్ అన్న అలెగ్జాండరు. ఇతను మార్క్సిస్టు కాదు. కానీ, ఆకాలంలో హింసా విధానము (Terrorism) మాత్రమే నిరంకుశ ప్రభుత్వచర్యను ఓర్చుకోలేని వారికి శరణ్యంగా ఉంటూవచ్చింది.

బాధ లెక్కువైనందువల్లా, వేరే యింకొక కార్యప్రణాళిక లేకపోయినందువల్లా, వారు ఇంకో మార్గంలేక వెర్రి ఆవేశంతో ఎవణ్ణో ఒకణ్ణి చంపడానికి ఆరంభించేవారు.

1887 లో రష్యా చక్రవర్తి మూడవ అలెగ్జాండరును చంపడానికి ప్రయత్నించినారు. ఇందుతో యీవ్యక్తి హింసా విధానం అంతమైనదనే చెప్పవచ్చు.

అతని తమ్ముడే మన లెనిన్.

ఇతడు చిన్నప్పటి నుండీ స్వతంత్రాభిప్రాయాలు కలవాడు. చెప్పిన పాఠాలను చక్కగా అవగాహన చేసుకో గల మేధావి. హైస్కూలు చదువును అంతంచేస్తూ మెట్రిక్యులేషను పరీక్షకు పోవలసి వచ్చినది.

విప్లవకారుని తమ్ముడు కావడంచేత పరీక్షకు వెళ్ళడానికి వీలులేదన్నారు అధికారులు. కానీ ఆస్కూలు హెడ్మాస్టరు సాయంవల్ల కడకెట్లో పరీక్షకువెళ్ళి పాసయినాడు. కజాన్ విశ్వవిద్యాలయంలో ప్రవేశించినాడు.

ఆకాలంలో విద్యార్థులలో కొన్ని అల్లరులు బయలు దేరినవి. అక్కడక్కడ రహస్య సంఘాలలో వీరు పాల్గొంటున్నట్లు అనుమానించి పోలీసులు వీరిని నానా తంటాలు పెట్టేవారు. ఈ అస్వాతంత్ర్యమే విద్యార్థుల నింకా రెచ్చగొట్టినది.

మచ్చుకు చూడండి: ఒకసారి ఒక ఉపాధ్యాయుడు చరిత్రను బోధిస్తున్నాడు. ఛార్లెస్ 2, నిరంకుశ పరిపాలనా అందుకు ప్రతీకారంగా ప్రజలు చెలరేగి అతన్ని

చంపివేయడం, ప్రకరణానుసారంగా చెప్పినాము.

రహస్యంగా వింటూన్న పోలీసు గూఢచారు లిది విని గుండెలు బాదుకున్నారు. ప్రభువులమీద తిరుగుబాటు లేవదీసే విషయాలు బోధిస్తున్నాడని పిల్లలందరినీ తరుము గొట్టి బడిని మూసివేసినారు.

ఇంత నిర్బంధం లేకపోయినా విశ్వవిద్యాలయాలలో ఆచార్యులకుకూడా స్వతంత్రం లేకుండా ఉండేది. ఇంకా విద్యార్థుల సంగతి చెప్పవలెనా?

ఈ అక్రమ విధానాలను ప్రభుత్వం వట్టి రౌడీతనంతో సమర్థించుకొంటూ ఉండినది. ఇందువల్లనే యువకులుగానూ కాస్తో కూస్తో ప్రపంచజ్ఞానం కలవాళ్ళుగానూ ఉన్న విద్యార్థులలో కళవళపాటు కలిగినదంటే ఆశ్చర్యమేమున్నది?

లెనిన్ వీనికి ప్రతీకారమెట్లా అని ఆలోచించి కడకు మార్క్సు వాఙ్మయం ఆలోడనం చేసినాడు. అందులో యితనికి మార్గం చూపబడి ఉన్నది. పద్నెనిమిదో సంవత్సరం నుంచే మార్క్సును అర్థం చేసుకోగలిగినాడంటే అతని ప్రతిభకు వేతే ఒరవురాయి కావలెనా?

ఈ రహస్యసంఘాలలో పాల్గొంటున్నాడన్న కారణంతో యితనిచదువుకు అడ్డుచెప్పినారు అధికారులు. కుకుష్కినో

అనే స్టేటుకు పంపివేసినారు.

ప్రయివేటుగా పరీక్షకు వెళ్ళవచ్చునన్నారు కడపటికి. అదే రకంగానే చదువుకొని 'లా' పరీక్షకుకట్టి 1891 లో పట్టభద్రుడైనాడు పీటర్సుబర్గు యూనివర్సిటీలో.

ఇక న్యాయవాదిగా పనిచేయవలెను. కాబట్టి 'సమరా'కు వెళ్ళి అక్కడ ఒక లాయరుదగ్గర సహాయుడుగా పని చేసినాడు.

1893 లో పీటర్సుబర్గులో, స్వంతంగా ప్రాక్టీసు చేయడానికై కాపురం పెట్టినాడు.

అక్కడ ప్రజల దరిద్రాన్ని, ప్రభుత్వ నిరంకుశ చర్యలనూ, ధనికుల దోపిడీవిధానాన్ని చూచి కళవళ పడినాడు.

అంతకు ముందే మార్క్సు సామ్యవాదులుకూడా కొందరున్నారక్కడ. వారితో చేయి గలవడానికి పూనుకొన్నాడు.

ఆకాలంలో రష్యాలో నరోడ్నికుక్కలు ప్రచారం చేస్తున్నారు. వారి ఉద్యమం మనగాంధీ ఉద్యమానికి చాలా విషయాల్లో పోలిక గలది.

పూర్వకాలపు గొంచె సేద్యాన్నే మరీ సాగించవలెను. రైతును మంచిస్థితికి తీసుకరావలెను.

గ్రామాన్ని స్వయం సంపూర్ణంగా చేయవలెను. అని అభిప్రాయపడుతున్నారు.

ప్రాచీన పద్ధతులే మంచివి కాబట్టి మరీ మన మానిర్మాణ విధానాలనే అనుసరించవలెనని వీరివాదము.

కానీ, యీపద్ధతు లెప్పటికైనా సాధ్యంకావు. విజ్ఞానం కావలసినంత అభివృద్ధి చెందుతున్నప్పుడు దాన్నే సర్వులకూ ఆచరణ యోగ్యం అయ్యేమార్గం చూచుకోవాలి గానీ, అసలు విజ్ఞానాన్నే ధ్వంసంచేసి మరీ వెనక్కు పోదామనడంలో గల గొప్పదన మేమున్నది? కానీ యీ ఉద్యమమే ఆ ప్రజకెంతో మెలకువను కల్పించింది. 1884 'ప్లెకనోవ్' ఒక కార్మిక పక్షాన్ని 'లిబరేషన్ ఆఫ్ ది లేబర్ గ్రూప్' అనే పేర నెలకొల్పినాడు. ఇంత వరకూ రైతు పక్షాలే కాని కార్మికపక్షం లేదు.

అక్కడక్కడ యువకులలో చాలామంది విప్లవకారులు కావడం మొదలు పెట్టినారు. మార్క్సు తత్వాన్ని అవగాహనం చేసుకోవడానికి ప్రయత్నిస్తూ వచ్చినారు. లెనిన్‌కు యీ సాహిత్య సమాలోచనం మూలాన అతనికి ప్రపంచ పరిస్థితులన్నీ కళ్ళకు కట్టినట్టు కనబడినవి. ఈ నిరంకుశ ప్రభుత్వం ధ్వంసమైతేనేకానీ, ఈ ధనిక విధానం రూపుమాసితేనేగానీ, ప్రపంచం శాంతంగా

ఉండలేదని చక్కగా అతని హృదయానికి నాటినది.

అందువల్ల తాను కార్యరంగంలోనికి దిగి ప్రస్తుత ప్రభుత్వ పద్ధతిని తొలగించి, సౌఖ్యప్రదమైన సమసంఘాన్ని స్థాపించడం ముఖ్యమని దృఢంగా నిశ్చయించుకొన్నాడు. 1893లో పీటర్సుబర్గులో తన లాయరువృత్తిని వదలుకొని అచ్చం విప్లవకారుడుగా పనిచేయడం ఆరంభించినాడు.

ఇప్పటినుండే యితని జీవితంలో ఒక క్రొత్త ఘట్టం మొదలు.......................

---

## 2

పీటర్సుబర్గు పట్టణంలో చాలామంది మార్క్సుజం చదువుకొన్నవాళ్ళున్నారు. అక్కడ చాలామంది ప్రతిభావంతులుకూడా ఉన్నారు.

అచట ధనవంతులుకూడా మార్క్సును చదువుకొని 'లీగల్ మార్క్సిస్టు' పార్టీని స్థాపించుకొన్నారు.

వారిదొక పిడివాదం. మార్క్సు ధనికవిధానం తప్పక వస్తుందన్నాడు. అది చేయవలసిన మేళ్ళుకూడా ఎన్నో ఉన్నాయి. అవన్నీ అయిపోతే దానంతటదే నశించిపోతుందనికూడా అతడే అన్నాడు. కాబట్టి దానిని కూలద్రోయడానికి పూనుకోవలసిన పనిలేదు. వేరొకప్రక్క విప్లవతత్వంగల మార్క్సిస్టు పక్షంకూడా పనిచేస్తున్నది. పై వాదం అసత్యమనీ, విప్లవమే ప్రపంచశాంతి స్థాపనకు పునాది అనీ వీరు కనుక్కున్నారు. అందుకోసం సామ్యవాద పుస్తకాలను చక్కగా చదువుకోవడం మంచి శిక్షణగలవారిని తయారుచేయడం ఇదీ వీరప్పటికి చేస్తున్నపని.

ఈ పార్టీలోనికి మన లెనిన్ చేరినాడు. ఇతడు మంచి మేధావి. విద్యావంతుడు. చరిత్రను కూలంకషంగా చదువుకొన్నవాడు. మార్క్సు తత్వాన్ని యథాతథంగా తెలుసుకొన్నవాడు. కాబట్టి పార్టీలో తొందరలోనే

ప్రాముఖ్యాన్ని సంపాదించుకొన్నాడు.

వారంతకుముందు కేవలం సిద్ధాంతాలనుమాత్రం ఏకరువు పెడుతున్నారు. ఇవి సామాన్యజనానికి బోధపడడం కష్టం.

వారి దినజీవితంలోని సంఘర్షణాలకూ, సిద్ధాంతాలకూ ఉన్న సంబంధాన్ని తెలియజెప్పితేనే కానీ లేకపోతే యిదేదో శాస్త్రాల సంగతులు—మనకేమిటికని కూలోళ్ళు రైతులూ వీనిపక్కైనా తిరిగిచూడరు.

అందుకోసమే లెనిన్ వట్టి సిద్ధాంతాలు లాభం లేదనుకొన్నాడు. దినచర్యలో వారికి కావలసిన వసతులేవి? అవి లేకపోవడానికి తగిన కారణాలేవి? వానిని యేవిధంగా యెదిరించవలెను? ఎట్లయితే అతడూ ఒక మనిషిగా ఉండడానికి వీలుంటుంది? ఇట్లాంటి విషయాలను పేదవారికి బాగా అర్థమయ్యేటట్లు పారిభాషిక పదాల ప్రాముఖ్యం లేకుండా చెబితేనేగానీ ప్రయోజనం లేదు. ఇట్లా చేయవలెనంటే కేవలం పుస్తకజ్ఞానమేకాక ప్రజలలో ఉన్న పరిస్థితుల జ్ఞానం కావలెను.

అందుకనే లెనిన్ కార్మికులలోచేరి వారి జీవితాన్ని చక్కగా తెలుసుకొనే వాడు. వారితో కలిసిమెలిసి తిరుగుతూ వారి పరిస్థితులను బాగా గ్రహించుకొని

కావలసిన సలహాలనిస్తూ తలలో నాలుకవలె ప్రవర్తిస్తూ ఉండినాడు.

ఇందువల్ల వారి కేరకమైన పద్ధతితో నచ్చజెప్పవలెనో తెలుసుకొని హృదయపూర్వకమైన ఆవేదనతో వారిలో ప్రచారంచేస్తూ ప్రబోధాన్ని కల్పిస్తూ సామ్యవాదాన్ని సర్వవిధాలా నలుప్రక్కలా వెదజల్లుతున్నాడు.

1894-5, లో యీవిధమైన సామ్యవాద సాహిత్యం చాలినంత అభివృద్ధి గాంచినది. లెనిన్ మొదలైన వారు వ్రాస్తూ వచ్చినారు. ఈ వ్రాతలు పూర్తి ఉద్రేకకరంగా ఉండక చల్లగా విషయాలను బోధించేవిగా ఉండినవి.

ప్రభుత్వం యీసాహిత్యంపైన ఒక కన్ను పెట్టి పరిశీలిస్తూ వచ్చినది. వీరి వ్రాతలను కొన్నిటిని నిషేధించినది.

అప్పుడు లెనిన్ 'ప్రజల కెవ్వరు మిత్రులు; వారే విధంగా సోషల్ డెమొక్రాటులతో పోరాడుదురు' అనే కరపత్రం వ్రాసినాడు. అదే మొట్టమొదట రష్యా భూమిలో విత్తినమార్క్సు విప్లవబీజ మనవచ్చు. అప్పటి నరోడ్నిక్కుల వాదాన్ని ప్రతికిృయావాదమని రుజువు చేసినాడు. రష్యాలో యేవిధంగా ఆర్థిక విధానం అభివృద్ధియైనదీ చక్కగా విశదపరచినాడు.

మార్క్సిజము ఒక మూఢవిశ్వాసం కాదు; ఒక శాస్త్రీయ విధానము. అంతకన్న ప్రపంచ పరిస్థితుల లోని అవకతవకలను సరిచేయగలది మఱొకటి లేదు. కాబట్టి ఆవిధానమే సర్వశరణ్యమని యెన్నో ఉదాహర ణాలతో వివరించినాడు.

1895లో లెనిన్ విదేశాలకు పోవలె ననుకున్నాడు. ప్లెకనోవ్‌తో స్నేహం కుదుర్చుకొని స్విట్జర్లెండుకు వెళ్ళ నిశ్చయించుకున్నాడు. అంతర్జాతీయంగా ఉద్యమం వ్యాపించవలెనంటే విదేశాలలోని మార్క్సిస్టులతో కూడా సావాసంచేసుకోవాలను కున్నాడు.

విశ్వవిద్యాలయంలో నుంచి వెళ్ళగొట్టినప్పటి నుండి పోలీసు లితణ్ణి గమనిస్తూనే ఉన్నారు.

కడకట్లో ప్లెకనోవ్ దగ్గఱకు వెళ్ళినాడు.

అత డీతణ్ణి సంపూర్ణానందంతో యెదుర్కొన్నాడు. భావి రష్యా భాగ్యవిధాతగా పేర్కొన్నాడు.

లేబర్ గూ్రపుతోనూ ప్లెకనోవ్‌తోనూ సంబంధం కల్పించుకొని ఏవో కొన్ని సమాలోచించుకొని తిరిగి వచ్చేటప్పుడు కావలసిన ప్రచారసామగ్రిని తీసుకొన్నాడు. ప్రచారం సాగవలెనంటే ఒక ప్రెస్సు అత్యవసరమని అందుకు కావలసినవన్నీ తెచ్చినాడు. ఒక పత్రికను

స్థాపించినాడు ఆ ముద్రాయంత్రిందద్వారా. దాని పేరు 'Rabocheye Delo' (కార్మిక వివాదం) చట్ట విరుద్ధంగా దీనిని వేయువలెను. కడకు మొదట యిష్యూ తయారైనది.

ఇదంతా పోలీసులు కనిపెడుతూనే ఉన్నారు. ఆముద్రా యంత్రాన్ని పంచిపెట్టడానికి సిద్ధంగా ఉన్న పేపరు కాపీలను, స్వాధీనం చేసుకొని, తత్సంబంధీకుల నందఱినీ. అరెస్టు చేసినారు. ఏకొద్ది పార్టీమెంబర్లో మాత్రమే బంధనాన్ని పొందలేదు. ఈ పార్టీలోనే క్రొపస్కియా, అనే ఆమె ఉండినది. ఆమెను మఱీ ఒక సంవత్సరానికి అరెస్టు చేసినారు. ఈమెయే లెనిన్‌కు తర్వాత భార్య యైనది.

ఈ రాజకీయ ఖైదీలను యేకోర్టులోగానీ విచారించే పనే లేదు. వాళ్ళ అదృష్టాన్ని, పోలీసు అధికారి సలహాపైన, జారు నిర్ణయించ వలసిందే. అదికూడా ఎంతకాల మైనా కావచ్చు.

వీరందఱినీ 'డిటెన్షన్ కాంపు'లో ఉంచినారు.

లెనిన్ చాలా యెత్తుగడలను తెలిసినవాడు. జైల్లోనే ఉండి తమలో తాము సంప్రదించుకోవడం, బయటి పరిస్థితులను గమనిస్తూ ఉండడం జరుపుతూ వచ్చినాడు.

అంతేకాకుండా విప్లవతత్వంతో కూడిన కరపత్రాలెన్నిటినో వ్రాసి బయట పంపి, సమ్మెలకు కూడా కారణమైనాడు.

కట్టకడపటికి 1897 జనవరిలో లెనిన్నూ అతని సహచరులనూ, తూర్పు సైబీరియాకు మూడేండ్ల ప్రవాసం పంపవలె నన్నారు. తన స్వంత ఖర్చులపైన, యెవ్వరు కూడా లేకుండా, అక్కడ తిరగవచ్చు నన్నారు.

అక్కడ మూడేండ్లు 1900 వరకూ ఉన్నాడు. అక్కడికే క్రొప్స్కియాను కూడా కొన్నాళ్ళ తర్వాత ప్రవాసం పంపినారు.

అచట వీరిద్దరకూ ఉన్న మైత్రి ప్రేమగా పరిణమించింది. ఇద్దరూ విప్లవకారులే. కాబట్టి జత సరిపోయింది. ఆయేట జులైలో వారు పెండ్లి చేసుకొన్నారు. దంపతులైనారు.

అదీ దాంపత్యమంటే. ఒకటే తత్వం కలవారైతేనే గాని ప్రేమ పరిపూర్ణం కాదు. అందులో యిట్టి ప్రపంచ నాయకునకు తనవంటిసతి ఒనగూడినది కాబట్టే మహత్తర ప్రోత్సాహం కలిగి ఉంటుంది. ఈ దంపతులు ప్రపంచానికి ఆదర్శప్రాయులై తమ సౌఖ్యాన్ని ఆశించక ప్రపంచం కోసమె ప్రతిక్షణమూ ధారవోసినా

రంటే ఆనందదాయకంగాదూ!

ఆ సైబీరియాలో యితడు యథాక్రమంగా నియమిత పద్ధతిలో తన కార్యాలు నెఱవేర్చుకొంటూ వచ్చినాడు. ఆ కాలంలోనే 'రష్యాలో ధనికవిధాన అభివృద్ధి' అనే పుస్తకాన్ని వ్రాసినాడు. నిర్బంధమంటే అతను యేదో విధంగా గడపక యెప్పటివలెనే తన పనులు తాను చేసుకోవడం గొప్పవిషయం. అందులో యింత తాత్త్విక వాఙ్మయం వ్రాయడమంటే ఈ పుస్తక మొక నూతన శకాన్ని కల్పించినది. నరోడ్నిక్కులు - మన దేశంలో యిప్పుడంటూన్నట్లే-రష్యాలో ధనిక విధానం లేదనీ అందువల్ల సోషలిజం రావలసిన అవసరంలేదనీ సాగదీసే వాళ్ళు.

ఈ వాదా లన్నిటినీ చక్కగా విమర్శించి లెక్కలతో సహా దాఖలుచేసి యేవిధంగా ధనికతత్వం అభివృద్ధి అవుతున్నదీ స్పష్టపఱచినాడు.

అంతే కాక 'రష్యన్ డెమొక్రటుల కర్తవ్యం' అనే పుస్తకాన్ని పూర్తి చేసినాడు. దీనినే తర్వాత కొన్ని చేర్చి 'ఏమి చెయ్యడం' అన్న పేరుతో ప్రకటించినాడు.

వెబ్బ దంపతులు యింగ్లీషులో వ్రాసిన 'కార్మికోద్యమ చరిత్ర' (History of Trade Unionism) అనే పుస్త

కొన్ని రష్యన్ భాషలోనికి తర్జుమా చేసినాడు.

ఇంత చేస్తున్నా తమాషాగాకూడా కాలం గడిపేవాడు. విశ్రాంతి సమయాలలో చదరంగ మాడుతూండినాడు. ఈ ఆటలో యితను చాలా పేరుమోసినవాడు. అప్పు డప్పుడు బందూకా వేట వెళ్ళేవాడు,

... ... ...

ప్రభుత్వం పీటర్సుబర్గులో కార్మిక నాయకులందఱినీ అరెస్టు చేసింది. అప్పుడు సోషల్ డెమొక్రటులు 'మిన్స్క్' పట్టణంలో ఒక ప్రతినిధి సభను జరిపినారు. నాయకులందఱూ నిర్బంధాలలో ఉన్నందువల్ల అంత చక్కగా ఆసభ జరగలేదు. కానీ, అందులో ఒక ప్రణాళికను (Manifesto) తయారుచేసి ప్రకటించినారు. వచ్చే విప్లవం ధనికవిప్లవమనీ దానితో జారు ప్రభుత్వం పడి పోగలదనీ తెలిపినా రందులో.

కార్మికులుకూడా తమ అత్యవసర వసతుల కోసం సమ్మెలు చేస్తూ యింతే చాలనుకున్నారు. 'ఎకానమిస్టులు' (అర్థ శాస్త్రవేత్తలు) రాజకీయ రంగాన్నంతా ఆక్రమించుకొన్నారుకూడా. సోషియల్ డెమొక్రటులు విప్లవతత్వాన్నే మఱచిపోయి సమ్మెలే చాలనుకొని ట్రేడ్ యూనియనిజం మార్గాన్నే ఆశ్రయించినారు.

'సోషలిస్టు రెవల్యూషనరీలు' అనేపార్టీ ఒకటి బయలు దేరింది. ఇందులో ఛోటా బూర్జువాలందరూ కలిసి శాస్త్రీయ సామ్యవాదం కాక యేదో మసిబూసి మారేడు కాయచేసి నాలుగుమాటలు చెప్పి అదే సామ్యవాద మనేవారు.

ఈ విధంగా వీళ్ళందరూ చేరి ప్రతిక్రియావిధానం సాగి స్తూన్నా వారెంత వద్దనుకున్నా విప్లవతత్వ తరంగాలు ప్రజాసామాన్యంలో విజృంభిస్తున్నాయి.

ఇదంతా విన్నాడు లెనిన్. దీనిని అణచివేయడానికీ కార్మికుల్లో విప్లవతత్వాన్ని చెలరేగేటట్లు చేయడానికి ఒక 'మానిఫెస్టో' తయారుచేసి ప్రవాసంలో ఉన్న మిగతా వారుకూడాచేరి పధ్నాలుగు మంది సంతకాలతో ప్రచురించి రష్యాలో పంచిపెట్టేటట్లు చేసినారు.

1900 లో లెనిన్ ప్రవాసం పూర్తి అయింది. పీటర్సు బర్గు దగ్గరవున్న 'ప్స్కావ్' అనే ఊళ్ళో ఇతణ్ణి ఉండ నిచ్చినారు.

అక్కడనే ఉండి సోషల్ డెమొక్రటులతో జాబులు జరుపు తున్నాడు.

వీరందరికీ సమానశత్రువులుగా ఉన్న 'ఎకానమిస్టుల'తో పోరాడడానికై వీళ్ళలో వీళ్ళకు కొన్ని అభిప్రాయ

భేదాలున్నా ఏకముఖమైనారు.

స్కాల్‌లోనే ఒక సమావేశం జరిగింది. అందులో ప్రచారం కోసం విదేశాలకువెళ్ళి అక్కడి లేబర్ గ్రూపుతో కలిసి ఒక పత్రికను స్థాపించవలెనని ముగ్గురిని ఏర్పరచినారు. వారే 'లెనిన్, మార్టోవ్, పెట్రోసోవ్'.

ఈ నిర్ణయ ప్రకారం లెనిన్ విదేశాలకు వెళ్ళినాడు. కొన్నాళ్ళకు భార్యకూడా ప్రవాసమునుండి వచ్చి యితనితో చేరుకున్నది.

1900 అంత్యానికి పత్రిక వెలువడేటట్లు చేసినారు. దాని పేరు 'ఇస్క్రా' (మిణుగురు) రష్యాకు యీ పేపర్లు రహస్యంగా పంపుతూ వచ్చినారు.

బవేరియన్ పోలీసులు వీరిమీద నిగా ఉంచి కొన్ని కష్టాలు కల్పించినారు. ఇందువల్ల ఈ పత్రికా కార్యస్థానాన్ని 1902 లో లండన్‌కు మార్చినారు.

రష్యాకు సంబంధించిన విషయాలన్నీ లెనినే వ్రాసిపెట్టేవాడీపత్రికకు.

ఈ పత్రికకు క్రొత్త విలేఖరిగా 'ట్రాట్స్కీ' అనే యువకుడువచ్చి కుదురుకున్నాడు.

అతని కప్పుడు 23 యేండ్లు మాత్రమే ఉన్నా సారస్వతం

లో బాగా చేయిదిరిగినవాడు. మంచి పట్టుదలగల వాడు. ఇందువల్ల కొన్నాళ్ళలోనే పార్టీలో కొంత ప్రాముఖ్యత సంపాదించుకొన్నాడు.

ఆ పత్రిక సంపాదక వర్గంలో లెనిన్, మార్టోవ్, పెట్రో సోవ్, యువకులు. ప్లెకనోవ్ వయసు మళ్ళినవాడు, అంతర్జాతీయంగా పేరుపొందినవాడు. అతనితో, కొన్ని సమయాల్లో, వారికి భేదాభిప్రాయాలు కలుగుతూన్నా, అంతర్జాతీయ విషయాల్లో మాత్రం అందరూ ఏక ముఖంగా పనిచేసేవారు.

జారుకు విరుద్ధంగా జరిగే సంఘటనలన్నీ సమర్థిస్తూండే వారు. అయితే విప్లవకారులకూ యితరులకూ ఉన్న భేదాన్ని స్పష్టంగా చూపుతూ వచ్చినారు. ఏరోటి కాపదంపాడే రకాన్నంతా నిర్దాక్షిణ్యంగా విమర్శిస్తూండే వారు. నిరంకుశ పరిపాలనను డీకొనే విషయంలో మాత్రం వీరందరూ ఒకటై పనిచేసేవారు.

ఈ సమయంలో లెనిన్ పత్రిక విషయంలో యెక్కువగా పనిచేయవలసి వచ్చినది. పైకి మాత్రం వీళ్ళతో చేరి సమయానికి తగినట్లు ప్రవర్తిస్తూన్న వారందరినీ పార్టీలో నుంచి తొలగించి వేసినాడు.

ఇదసలు చాలా ముఖ్యమైన విషయం. ఎప్పటికైనా

యిటువంటి మోసగాళ్ళు పార్టీలో ఉంటే తప్పకుండా వారుచేసిన అవకతవక పనులన్నీ వీరిమీద పడడమే కాక, విప్లవ కాలంలో వీరెటూ యెదురు తిరిగేవారే. ఇతరులతో కావలసిన విషయాలలో ఒకటిగా పనిచేయ వచ్చుకానీ తమపార్టీలో చేర్చుకోరాదు. చక్కని శిక్షణా, నియమమూ లేనిపార్టీ ప్రయోజనంలేదు.

పార్టీ అంటే సమయం వచ్చినప్పుడు, సామాన్య జనులను నాయకత్వం వహించి నడిపించే వాళ్ళతో కూడినదిగా ఉండవలెను. నానాకవారినీ కలుపుకొని మాది పెద్ద పార్టీ అనుకుంటే లాభంలేదు.

ఇందుతో పాటు 'ఏమి చెయ్యడం' అనే కరపత్రం వెలువరచినాడు. ఇందులో తమపార్టీ యేవిధంగా నడుచుకో వలసినదీ, వారి కుండవలసిన గుణాలూ, చేయవలసిన కార్యక్రమం, మొదలైనవన్నీ బహువిశదంగా వ్రాసినాడు.

ఎకానమిస్టులు అనేవారుగదా! ధనిక తత్వం మూలాన కార్మికు లందఱూ మేకమాతున్నారు. వాళ్ళ దిన జీవితావసరాలకోసం పోరాడుతున్నారు. ఇంతకన్నా కావలసిందేమీలేదు. కాబట్టి ప్రత్యేకంగా ఒక విప్లవ పక్షం ఉండవలసిన అవసర మేముంది? అనే రకంగా.

వీటి నన్నిటినీ ఖండించినాడు. కార్మికుల్లో కలిగిన అవసర వాంఛను పూర్తిచేసుకుంటూ ప్రతిదినం కలిగే పోరాటాలలో జయించడమే కాదు కర్తవ్యం! ఈ కష్టాలను సమూలంగా నాశనంచేసే ఉపాయం తెలుసుకోవలెను. అది విప్లవం మూలానతప్ప నెరవేరదు.

కార్మికులకు దారిచూవడానికి ఒకపార్టీ ఉండడం చాలా ముఖ్యం. వారిని విప్లవకారులుగా తయారు చేయడానికి తగిన సన్నాహమంతా పార్టీచేయవలసి ఉంటుంది. అన్ని దేశాల చరిత్రనూ గమనించినట్లైతే మనకు తెలుస్తూన్న దేమిటి? ధనానికీ దరిద్రానికి కలిగే పోరాటం, అందుకు తగినట్టు న్యాయాలన్నీ ధర్మాలన్నీ ధనం ప్రక్కనే మొగ్గుతూండడం, ఇవన్నీ కార్మికులు తెలుసుకోగలరు. అందుకోసం కార్మికపక్షాలేర్పరచుకొని పోరాడుతుండగలరు.

కానీ యింత మాత్రంతో ప్రయోజనం లేదు. ఆ కష్టాలూ బీదతనమూ మొదలంట నాశనమైపోవడానికి తగిన మార్గం మేధావు లెవరైనా తెల్పవలెను. ఆ తోవవెంటనే వీరిని నడపడానికికూడా తెలివిగల వారి సహాకారం అత్యవసరం. అట్టి నాయకత్వం వహించే పార్టీ అత్యావశ్యకం. ఈ అభిప్రాయాలన్నీ 'ఏమి

చెయ్యడం' ద్వారా వ్యాపింప జేసినాడు.

కార్మికులకు మార్గదర్శిగా ఉండి, దృఢంగా పోరాటం చేసే శక్తిగలవారందరినీ మాత్రమే ఆపార్టీలో చేర్చుకొన్నాడు. వారికి సిద్ధాంతాలనూ కర్తవ్యమార్గాన్నీ 'ఇస్క్రా' ద్వారా తెలియజేస్తూ వచ్చినాడు.

ఈ ప్రయత్నం బాగా ఫలించింది. చాలామంది యీ పార్టీ అభిప్రాయాలను మెచ్చుకోవడం మొదలు పెట్టినారు.

రెండో సో. డి. కాంగ్రెసు బ్రిస్సెల్సులో సమావేశమైనది. ఇందులో మార్క్సిస్టు విప్లవకారులకు యెక్కువ పలుకుబడి కనిపించినది. 'ఇస్క్రా' ప్రచారంవల్ల బెల్జియం పోలీసుల హడావిడివల్ల వారు లండనుకు వెళ్ళిపోయినారు.

ఆ సభలో ఒక చీలిక యేర్పడినది. లెనిన్ ప్లెకనోవ్‌లు ఒక ప్రక్క, ట్రాట్స్కీ మార్టోవ్ మొదలైనవాళ్ళు ఒక ప్రక్క చేరినారు.

ఎందు కంటే:

పార్టీలో పక్కా విప్లవకారులే ఉండవలెను. ఏ మాత్రం అల్లాటప్పావాళ్ళను చేర్చుకొన్నా ప్రమాదకరం. అచ్చంగా ఉన్నంత కొద్దిమందే చాలు. మన మిప్పుడు జారు

ప్రభుత్వ పతనంకోసం యితరులతో పనిచేస్తాము. అంతే కాని వాళ్ళు మనపార్టీలో వద్దు. ఇది లెనిన్ వర్గపు వాదం.

అదంతా యెందుకు? జారుకు విరుద్ధమైన పక్షాలన్నిటినీ మనలో చేర్చుకుందాము. వీరంతా యిప్పుడు పనికి వస్తారుగదా అని మిగతావాళ్ళ వాదం.

కానీ,

లెనిన్ పక్షాన చాలామంది ఉన్నారు. మిగతావాళ్లు కొద్దిమందే. అందువల్ల యీ సోషల్ డెమొక్రాటిక్ పార్టీలో రెండుచీలిక లేర్పడినవి.

ఒకరు లెనిన్ పక్షం వాళ్ళు. వీళ్లు చాలామంది కాబట్టి బోల్షివిక్కులు.

మిగతావారు కొద్దిమంది ఉన్నారు కాబట్టి మెన్షివిక్కులు. ఇవి రష్యన్ పదాలు. ఆపేర్లే కడకు ఆపార్టీలకు శాశ్వతంగా నిలిచి, బోల్షివిజం మొదలైన పదాలుకూడా కలిగినవి.

'ఇస్క్రా' సంపాదకీయవర్గంలోకూడా బోల్షివిక్కులే అందఱూ స్థానం ఆక్రమించుకొన్నారు.

ఇదంతాచూచి మెన్షివిక్కులు లెనిన్ చాలా స్వేచ్ఛగా

ప్రవర్తిస్తున్నాడనీ, తమ కేమాత్రం స్వతంత్రం యివ్వ డం లేదనీ ప్రచారాలు సాగించినారు.

ఇందుతో చాలామంది వాళ్ళతో చేరినారు. ఆక్సల్రాడ్ (మెన్షివిక్కు) ప్లెకనోవ్‌కు చాలా మిత్రుడు. అందు వల్ల సావాసగాని మాటలవల్ల ప్లెకనోవ్ కూడా మెన్షివిక్కులలో చేరినాడు.

లెనిన్ మాత్రం కదలలేదు.

లెనిన్ తనపక్షపు అభిప్రాయ ప్రకారం ఒక వర్కింగు కమిటీని యేర్పరచుకొన్నాడు. ఒక పత్రికనుకూడా ఆరంభించినాడు. దానిపేరు అగ్రగామి (వెపర్డు)

ఇదంతా 1903 లో జరిగింది. 1905 లో జరుగబోయే విప్లవానికి ముందే యీ చీలిక కలిగినందువల్ల సో. డె. పార్టీ కొంత బలహీనం కాక తప్పినదికాదు.

ఈ విభాగంలో బోల్షివిక్ పార్టీ యేమాత్రం పనిచేయ గలిగినదీ, యెవరి అభిప్రాయాలు చక్కనివైనదీ కాలమే నిర్ణయించినది. లోకం గ్రహించ గల్గినది.

---

1905 జనవరి 22 తేదీ రష్యా ప్రథమవిప్లవపు రోజు. ఇదే అంకురార్పణం విప్లవానికి. దీనినే 'రెడ్ సండే' లేక 'బ్లడీసన్ డే' అంటారు.

వేలకొద్ది కూలీలు 'గేపన్' అనే మతగురువు నాయకత్వం క్రింద జారు ప్రభువు దగ్గఱకు పోయినారు. తమకు కావలసిన వసతులను గూర్చి ఒక పెటిషన్ తయారుచేసు కున్నారు.

అందులో తమకున్న కష్టాలన్నీ వెళ్ళబోసు కున్నారు. తమ జీవితం నరకప్రాయ మౌతున్నదని వలవించినారు. ప్రభూ మీరెల్లైనా కరుణించవలెనని వాకొన్నారు. మాకు రెండే తోవలు—స్వాతంత్ర్యం - సుఖం; లేదా మరణం అన్నారు.

వీళ్ళందఱూ యీ విధంగా రాజుగారి మేడముందరి మైదానంలో చేరినారు. చక్రవర్తికి గెపన్ జాబు వ్రాసినాడు. అతని కేభయంలేకుండా తాను పూచీఉన్నాననీ, దయచేసి కూలీలకు దర్శన మిప్పించమనీ కోరినాడందులో.

కానీ, రాజు సైన్యాన్ని పిలిపించినాడు. వాళ్ళందఱూ అనాయక ప్రజలమీదికి దూకినారు. వాళ్ళ కాళ్ళ

మీదబడి మాకు రాజదర్శనం చేయించమన్నారు. వారు వినలేదు.

అంతేకాదు,

వాళ్ళందఱినీ వరసబెట్టి కాల్పడం మొదలు పెట్టినారు. ఎంతమంది శిరస్సు లెగిరిపోయినవో? ఎంతమంది రక్తంతో నేల తడిసి పోయిందో?

ఎన్ని అమాయక హృదయాల్లో మంటలు రేగినవో గమనించేవా డెవడు?

ఆ సైన్యం అకాండతాండవం చేసివేసింది. సర్వనాశన మైనది. ఆ అన్యాయాలన్నీ అంతుమీరిపోయినవి.

పోలీసు రిపోర్టులను బట్టిచూస్తేనే ఆదినం 1000 మంది చనిపోయినారనీ, 2000 మందికి పైగా గాయపడినారనీ తెలుస్తున్నది.

ఆ కూలీలు కోరినవైనా పెద్ద కోరికలా? కాదు. ఖైదీలను విడువడం, పౌరసత్వ హక్కులు, అందఱికీ ఓటు హక్కు, వారితో ఎన్నుకొనబడిన ప్రజాప్రతినిధి సభ. ఇంత మాత్రానికే యీ అకృత్యాలు చేయించినాడు చక్రవర్తి.

ఈ మూలంగానే వారిలో రాజకీయ చైతన్యం బయలు

పడినది. ఈ దౌర్జన్యాలకు తాళలేకనే వాళ్ళు తిరుగు బాటుతప్ప గత్యంతరం లేదనుకున్నారు.

సమ్మెలెక్కువైనవి. విప్లవానికి ముందు పది సంవత్స రాలలోనూ సమ్మెలలో పాల్గొన్నవాళ్ళ సంఖ్య 4,30,000 మాత్రం. 1905 జనవరిలోనే విప్లవ ప్రారంభదినాల్లో సమ్మెలో పాల్గొన్నవాళ్ళ సంఖ్య 4,40,000.

పది సంవత్సరాల మొత్తం సంఖ్యకంటె ఒక్క నెలలోనే యెక్కువమంది సమ్మెలలో చేరినారు.

ఈ రకంగా దేశంలో గొప్ప సంచలనం బయలుదేరినది. కూలీలలో అన్ని రకాలవారూ చేరుతున్నారు. ఎంతటి త్యాగానికైనా సిద్ధమౌతున్నారు.

ఇందులో రైతుఉద్యమంకూడా మొదలైనది.

అంతలో విడువక యీ సమ్మెలు రాజకీయంగాకూడా మారిపోతున్నవి.

వీనితోబాటు నావికాదళాలలోనూ, సేనలలోనూకూడా మార్పు కనిపిస్తూ వచ్చినది. ఈరకంగా సమ్మెలు విప్లవ రూపం దాల్చినవి. దేశమంతా జనసామాన్యంలోకూడా మార్పులు కాన్పించినవి. కానీ సో. డి. పార్టీలో సైన్య శిక్షణ బడసినవారు ప్రభుత్వాని కెదురుగా

సైన్యాన్ని ఢీకొల్పగల బలశాలులు లేరు.

ఈసమయంలో లెనిన్ విదేశాలలో ఉండి కనిపెడుతూ వచ్చినాడు. కడకు రష్యాకు వచ్చినాడు. అక్కడ రైతు ఉద్యమంతో కూడా పరిచయం కలిపించుకున్నాడు.

ఈ సమయంలో యెన్నో సైన్యవిషయాలకు సంబంధించిన పుస్తకాలను చదివినాడు. ఉపన్యాసా లిస్తూ వ్యాసాలు వ్రాస్తూ ప్రచారం చేస్తున్నాడు.

1905 శరదృతువులో ఉద్యమం చాలా తీవ్రమైనది. అప్పుడు జారుప్రభువు ఒక డ్యూమా అనే ప్రజాప్రతినిధి సభను స్థాపిస్తామని ప్రకటించినాడు. అందులో అధికారాలేమీ లేవు. నామకార్థం యీ అనంతంగా ఆక్రమించుకొని వస్తూన్న విప్లవసముద్రాన్ని వెనుకకు త్రోయడానికే యీప్రయత్నం.

దానికి సంస్కరణవాదు లందరూ స్వాగతమన్నారు. బూర్జువాలు మెచ్చుకొన్నారు.

కానీ సో. డి. పార్టీవాళ్లు వీనిని నమ్మలేదు. ఇదంతా మోసం అని గ్రహించినారు. ఈడ్యూమాను బహిష్కరించినారు. శాసనాలనుచేయగల పరిషత్తు కావాలన్నారు. ఇందువల్లనే యిది స్థాపించకనే విప్లవ సంద్రంలో కొట్టుకొనిపోయింది.

1905 అక్టోబరు నాటికి లక్షల కొలఁదివైనారు సమ్మె దారులు. రైల్వేపనివాళ్ళు 'అఖిల రష్యా రైల్వేసమ్మె' ను జరిపినారు. రైళ్ళు నడవకుండా ఆగిపోయినవి.

ముద్రణా స్వాతంత్ర్యం సంపాదించుకొన్నారు. ఒకట్ పీటర్సుబర్గులోనే సో. డి. దినపత్రికలు మూడు బయలు దేరినవి.

ఇంమమూలాన కార్మిక ప్రతినిధులను ఫాక్టరీలనుంచి యెన్నుకొని 'సోవియట్ ఆఫ్ వర్కర్సు డెప్యూటీస్' అనే సంఘాలు బయలుదేరినవి. 'సోవియట్ ఆఫ్ సోల్జర్సు డెప్యుటీస్' 'సోవియట్ ఆఫ్ సైలర్సు డెప్యూటీస్' మొదలైనవికూడా యేర్పడినవి.

'1905 విప్లవం తీవ్రంగా విజృంభించి డిసెంబరులో మాస్కో తిరుగుబాటుగా పరిణమించింది.'

ఇందుకు లెనిన్ యెంతో ప్రయత్నించినాడు. సైనికా క్రమణ కూడదని మెన్షివిక్కులందరూ అన్నారు. అప్పుడు వారికెంతో తెలియజెప్పినాడు. మెన్షివిక్కు లలో ట్రాట్‌స్కీ ఉన్నందువల్ల అతను వాళ్ళనుకూడా ఒప్పించినాడు.

తిరుగుబాటుదార్లు తొమ్మిదిరోజులు ప్రభుత్వముతో ప్రతి ఘటించినారు. మాస్కో సైన్యాన్నికూడా ప్రభుత్వం

విశ్వసించలేరు.

కడకు పీటర్సుబర్గు నుంచీ 'సెమినోల్‌స్కీ' సైన్యాలు వచ్చి, తిరుగుబాటును అణచివేయసాగినవి.

పూర్తిగా హింసావిధానంతో వారినందరినీ అణచివేసినారు. కార్మికులలో సైనికశిక్షణను పొందియున్న వాళ్ళు కొద్దిమందే కావడంచేత విజయవంతంగా సాగడానికి వీలులేకపోయినది.

కడకు సేనలు తిరుగుబాటును అణచివేసినవి. ఈఅల్లరుల వల్ల జారుప్రభువుకూడ ఒకక్రొత్త ఎన్నికల చట్టాన్ని తయారుచేసినాడు. దానిప్రకారం ఒక డ్యూమా యేర్పడినారు.

కానీ మొదట డూమాను సో. డి. పార్టీ బహిష్కరించినది. కొందరేమో పాల్గొన్నారు.

ఈసమయంలో లెనిన్ యెన్నో వ్యాసాలు వ్రాసినాడు. మారుపేరుతో యెన్నిచోట్లనో ఉపన్యసించినాడు. యెంతో ప్రచారం సాగించినాడు. కానీ విప్లవంమాత్రం మరీ పొడసూపలేదు. ఈ మొదటి 'డ్యూమా' రైతుల భూమి పంపకాన్ని గూర్చి సమస్య లేవదీసేటప్పటికి క్రొత్తగా వచ్చిన ప్రధానమంత్రి ఆడూమాను రద్దు చేసినాడు.

రెండో డ్యూమాను యేర్పఱచినారు. అందులో ఉన్న మిత వాదులనుకూడా ప్రభుత్వం తృప్తిపఱచలేక పోయినది. అందువల్ల మరీ వీరికి స్పర్ధలు కలిగినవి. అందువల్ల సైన్య విషయంలో యేమోచేస్తున్నారని దీనినికూడా రద్దుచేసినారు.

తర్వాత యెన్నికలలో కొన్ని మార్పులు చేసినారు. భూస్వాములకు 10 కి తొమ్మిది స్థానా లిచ్చినారు. మూడవ డుమా అధికారంలోకి వచ్చినది.

విప్లవం పూర్తిగా అణగిపోయినది. యీ కాలంలో లెనిన్ చేసిన ప్రచారము చైతన్యశక్తిని కల్గించినది. కానీ ప్రజల్లో తగినతీవ్రత యింకా యేర్పడలేదు. అందువల్ల అపజయం చేకూరినది.

కాని యిందువల్ల యెంతో అనుభవాన్ని గడించుకొన్నారు. ఇది కేవలం వ్యర్థంగా గడచిపోయినదని అనకోరాదు. ఈ అపజయమే చక్కని శిక్షణనిచ్చి 1917 జయాన్ని పొందేటట్లు చేయగలిగినది.

తర్వాత మారుపేరుతో దొంగపాస్‌పోర్టుతో రష్యాలో తిరుగుతూన్న లెనిన్ విదేశాలకు మరీ ప్రయాణం సాగించినాడు. ఇప్పుడు పోయినపోవడం మరీ 1917 వరకూ రష్యాకు రానేలేదు.

---

## 4

విప్లవ మణగిపోయేటప్పటికి పార్టీ విచ్ఛిన్నమైపోయింది. అంధకార మావరించుకొన్నది.

అదను దొరకినది కానీ శక్తి సన్నగిల్లిపోయినది. విప్లవ తరంగాలు తరలిపోయినవి. ప్రాణమిత్రు లెందరో పరమపదించినారు. ఎందరో జైళ్లలో ఉన్నారు. అప్పుడు ప్రతిక్రియావాదం (Reaction) తో ఢీకొనడం కలలో మాట. కానీ మిగిలిన కార్మికబృందంతోనే చేతనైనంత పని చేస్తామనుకొన్నాడు.

తాత్కాలికంగా ఫలవంతమైన పనులేవీ చేయలేకున్నా నిమ్మళంగా పనికివచ్చే పనులేవైనా చేస్తామనుకున్నారు. వారు చేసినవేమంటే: నియమబద్ధమైనప్రచారం సాగించడం; మంచి బలకరమైన పార్టీని తయారుచేయడం; విప్లవ సిద్ధాంతాలను నూరిపోస్తూండడం; ఇవీ.

బోల్షివిక్కుపార్టీ నియమబద్ధంగా ఉన్నదని ఆనియమాలను ఓర్చుకోలేని కొందఱు మేధావులు బయలుదేరినారు. వీరికి నాయకులు బాగ్డనోవ్ - గొప్ప తాత్త్వికుడు - లునచర్స్కీ - బాగా చదువుకొన్నవాడు. వీరు అతివాదుల మనుకొనేవారు. లెనిన్ వీరిని మితవాదులన్నాడు.

బోల్షివిక్కులు 'డుమా'ను బహిష్కరించడం సరిపోలే

దా తెగవారికి. వారొక 'అగ్రగామి' (వెపర్డు) అనే పత్రికను పెట్టినారు. లెనిన్ 1904-5 లో నడపుతూన్న పత్రిక పేరూ యిదే.

ఈ వుతా మార్క్సిజాన్ని పునరాలోచించడంలో ఆయన తత్త్వాన్నే తల్లికిందులు చేసినారు. ఈ సిద్ధాంతాలకు రష్యా యితర దేశాలలో తలలూచేవాళ్ళు బయలు దేరినారు. గోర్కీ సాయంతో వీరు కాప్రీలో - తర్వాత బాలొగ్నాలో - ఒక స్కూలు స్థాపించి, దాని ద్వారా తమ సిద్ధాంతాలను బోధిస్తూ వచ్చినారు.

ఈ విమర్శనలను నిర్ధూమధామం చేయడానికి లెనిన్ పూనుకొన్నాడు. పార్టీ కార్యరంగాల్లో కేవలం సిద్ధాంత విషయాల లెక్కవగా విమర్శిస్తూ ఉండకపోయినందువల్ల యితనికి 'తాత్త్విక' విషయాలలో యోగ్యత లేదని చేసే ప్రచారాలన్నిటినీ ఊపులో యెగురగొట్టినాడు.

లెనిన్ మేధ. అసలు మార్క్సిజం స్వరూపం తేట పఱచినాడు. వీళ్ళ విమర్శన లన్నిటినీ ఖండించడానికై 'మెటీరియలిజం అండ్ ఇంపీరియో క్రిటిసిజం' అనే పుస్తకాన్ని వ్రాసినాడు.

ఈ అనవసర శ్రమవల్ల లెనిన్ కాలం వ్యర్థమై వుండవచ్చు కానీ తత్త్వ సారస్వతాని కెంతో మేలు చేకూరినది.

సిద్ధాంతాలలో పెడదారి త్రొక్కుతున్న వీరి విశ్వాసం మెల్లగా మతపిచ్చికి చెవి వాలవేయడం మొదలు పెట్టినది. 'దైవ నిర్మాణ (Logostroitelstvo) సిద్ధాంతాన్ని 'లునచర్స్కి' లేవదీసినాడు. ఈ అభిప్రాయాలనే గోర్కీ 'అంగీకారం' అనే నవలలో ప్రతిబింబించి వేసినాడు.

ఈవిధంగా విప్లవానంతరం ఒక్క గొప్ప రాజకీయపతనం 1907 లో మొదలుపెట్టి 1911 కు అంతమైనది.

1912 కార్మికులలో తిరిగీ చైతన్యం కలిగినది. 1905లో కన్నా యిది భిన్నమైనది. ఇందులో కార్మికవర్గం ప్రత్యేకంగా ఉక్కు తునియగా మారినది. తూర్పు సైబీరియాలోని బంగారు గనులలో 1912 ఏప్రిల్ 4 వ తేదీ కార్మికులలో సంచలనం కలిగినది. పోలీసులు చాలామందిని కాల్చినారు.

1905 'రెడ్‌సండే' విప్లవానికి కారణమైతే యీ 'లెనా' కాల్పులు తొట్టతొలి పరిశుద్ధ కార్మిక సామ్యవాద ఉద్యమానికి నాందీ అయిన దనవచ్చు. రష్యా కమ్యూనిజం పుట్టినదిన మనవచ్చు.

పై కారణాలవల్లనే పై రెండు దినాలను సోవియట్ ప్రభుత్వం అధికారరీత్యా స్మారకదినాలుగా భావిస్తున్నారు. ఆకాల్పులు జరిగిన 18 నాళ్ళకు పీటర్సుబర్గులో కార్మిక

దినపత్రిక 'ప్రవదా' (సత్యం) అనేపేర బయలుదేరినది. దీని నెన్నిసారులో పోలీసులు అణచివేసినారు. కానీ ఏదో ఒక పేరుతో ఏదో ఒకచోట - కడకు యుద్ధప్రారంభంతో పూర్తిగా ధ్వంసంచేసే వరకూ - ప్రకటింపబడుతూనే ఉండినది.

లెనిన్ పారిస్‌లోనూ, 1912 తర్వాత గలిపియా (క్రాకో దగ్గర)లోనూ ఉండి దినమూ సంపాదకీయ వ్యాసాన్ని పంపుతూండేవాడు.

1912 లో ప్రేగూనభలో మెన్షివిక్కులతో బోల్షివిక్కులు సంబంధం తెగ్రించివేసుకున్నారు. లెనిన్ పార్టీతో కార్మికులందరూ చేయిగలిపినారు.

1912లో, 1907 లా ప్రకారం కార్మిక నియోజక వర్గాల నుండీ పోయిన ప్రతినిధులు బోల్షివిక్కులే.

ఇది లెనిన్‌కు గొప్ప విజయం. 1912-14 సమయం లెనిన్‌కు గొప్ప తరుణం. ఇప్పటి కితడే నాయకుడని అందరూ సమ్మతించినారు. విధిలేకైనా ఒప్పుకోవలసి వచ్చినది. కానీ రహస్యంగానే ఉండేవాడు.

పార్టీకమిటీ, పార్టీ పేపరు ప్రవదా, వీనిని యితడే నడుపుతూ కార్మికోద్యమాని కంతా పునాదిగా ఉండినాడు.

---

# 5

1914కు ముందునుండీ కూడా లెనిన్ అంతర్జాతీయ వ్యవహారాల్లో జోక్యం కల్పించుకుంటూ వచ్చినాడు. స్టట్‌గర్టు (1907) కోపెన్‌హేగెన్ (1910) బసెల్ (1912) ప్రదేశాలలో జరిగిన అంతర్జాతీయ సభలలో రష్యా ప్రతినిధిగా పాల్గొంటూ వచ్చినాడు.

స్టట్‌గర్టులో లెనినూ, రోస్‌లక్సెంబర్గు - పోలిష్ మెంబరు - కలిసి యుద్ధ విషయమైన తీర్మానాన్ని తయారు చేసినారు.

ఒక దేశానికీ యింకో దేశానికీ జరిగే ధనికయుద్ధాన్ని, ఒక వర్గానికీ యింకో వర్గానికీ జరిగే అంతర్యుద్ధంగా మార్చివేయవలెనని మార్క్సు యేంజిల్సుల సిద్ధాంతాల ననుసరించి వివరించినా రందులో.

మార్క్సిస్టులనేవా ళ్ళెవరూ దాన్ని యెదిరించలేక పోయినారు. కానీ తీవ్రివదాలవల్ల కొంత ప్రమాదమన్నారు జర్మను ప్రితినిధులు.

ఈ సిద్ధాంతం, తర్వాత బసెల్ కాంగ్రెసు (1912) లో స్పష్టంగా వివరింపబడినది.

యుద్ధసన్నాహ కాలంలో పీటర్సుబర్గు కార్మికులు విప్లవ తత్త్వం కలవారుగా ఉన్నారు. ఆ ప్రాంతాలలో వేలకు

వేలమంది కార్మికులు సమ్మెలు కడుతున్నారు.

లెనిన్ గలీషియాలో ఆస్ట్రియా అధికారులతో అరెస్టు చేయబడినాడు. కానీ విక్టర్ అడ్లర్ చెప్పిన మాటల వల్ల ప్రభుత్వ మితణ్ణి వదలివేసి దేశం విడిచిపోవడానికి అనుమతించింది.

తర్వాత యుద్ధంమీద 'థీసిస్' వ్రాసి బర్న్‌లో 6-7 సెప్టెంబరులో జరిగిన ఎమిగర్ బోల్షివిక్కుల మీటింగుకు సమర్పించుకొన్నాడు.

స్వేఛ్ఛా వాణిజ్యం యీ ధనిక విధానంలో యెక్కువవుతుంది. దానివల్ల పోటీ లేర్పడతవి. పెద్ద సావుకార్లు చిన్నవాళ్ళను దివాలా కొట్టిస్తారు.

ఈ విధంగా ధనం ఒకచోట చేరడం ఆరంభిస్తుంది. పెట్టుబడిదారులు కొద్దిమందే అవుతారు.

విజ్ఞానం మూలాన అభివృద్ధియైనసాధనాలద్వారా ఉత్పత్తి ఎక్కువవుతుంది.

ఇందుకోసం వారికి ముడిసరుకులకుగానూ, తాము తయారుచేసిన సరుకులను కొనడానికి బజారులకుగానూ, ధనికులు యితర దేశాలను లోబరచుకోవాలనుకుంటారు. అందువల్ల యుద్ధాలారంభమౌతాయి.

రెండు పక్షాలవారూకూడా బీదవారి కష్టాలు చూచే వాళ్ళుకాదు. గెల్చినా ఓడినా బీదలకువచ్చే లాభ మేమీలేదు.

కాబట్టి ఈ సామ్రాజ్యతత్వంగల యుద్ధాలలో సామ్య వాదులు పాల్గొనరాదు. ఇటువంటి సామ్రాజ్యతత్వాన్ని ధ్వంసం చేయడానికై ప్రయత్నించవలెను.

రష్యన్ సో. డె. పార్టీవారు జారు ప్రభుత్వాన్ని కూల ద్రోయడానికి ప్రయత్నించవలెను.

'యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చవలెను.' రెండో యింటర్‌నేషనల్ పడిపోయింది. నిజమైన విప్లవ తత్త్వం గల మూడోది ఏర్పరచవలెను.

ఈ విషయాలన్నీ అందులో స్పష్టపరచి విపులంగా వ్రాసినాడు.

బోల్షివిక్కు సెంట్రల్‌కమిటీ, రష్యాలోని పార్లమెంటరీ పార్టీ, యీ వ్యాసాన్ని అంగీకరించినారు. ఆకార్య ప్రణాళికను ఆచరణలోకి తీసుకురావడానికి కృత నిశ్చయు లైనారు.

ఈ అభిప్రాయ ప్రచారంకోసం 'ప్రవ్దా' పార్టీ చాలా ప్రయత్నించినది. తత్ఫలితంగా అయిదుగురు మెంబర్లను

అరెస్టుచేసి సైబీరియాకు పంపింది ప్రభుత్వం. దీనిని బాగా అర్థమయ్యేటట్టు తెలియజేసినాడు లెనిన్.

1915 లో రష్యా కార్మికులను 'అంతర్జాతీయ యుద్ధ సమితికి' ప్రతినిధులను పంపమన్నది ప్రభుత్వం.

పెట్రోగ్రాడు కార్మికులు దానిని తిరస్కరించి ప్రతినిధులను పంపలేదు. మెన్షివిక్కులలోని కొందఱు మాత్రం అందులో పాల్గొన్నారు.

యుద్ధ పరిస్థితులు రష్యాలో బోల్షివిక్కుల కార్యాలకు చాలా ప్రతీకారం చేయసాగినవి. ఏ కొందరోతప్ప బోల్షివిక్కు నాయకులంతా నిర్బంధితులై సైబీరియాలోనో చెరసాలలలోనో ఉన్నారు.

1916 ఆఖరుకు విప్లవానికి తరుణం వచ్చేటట్టు స్పష్టపడినది. లెనిన్ అప్పుడు అంతర్జాతీయ విషయాలలో అవధానం కలిగి పనిచేస్తూన్నాడు. విప్లవానికి సన్నద్ధుడౌతున్నాడు.

రష్యాలో ప్రజాస్వామికం యేర్పడినంతమాత్రంలోనే లాభంలేదు. ధనికతత్త్వం ఉన్నంత కాలం సామ్రాజ్య వాంఛ ఉండనే ఉంటుంది. కాబట్టి సామ్రాజ్యతత్త్వం పూర్తిగా నశించవలెను.

అందుకు అక్కడి ప్రజ లక్కడే పనిచేయవలెను.

శాంతివాదులు చెప్పేమాటలు అర్థంలేనివి. ధనిక ప్రభుత్వాలలో శాంతి స్థాపించడమంటే మరీ యుద్ధంకోసం సన్నద్ధులు కావడానికి విశ్రాంతి తీసుకోవడమన్నమాట తప్ప వేఱే కాదు.

నిజమైన శాంతి, ధనిక దరిద్రత త్త్వంగల రాజ్యాలలో యేర్పడదు. విప్లవంద్వారా సహా సమాజ మేర్పడితేనే గానీ మాటలలో శాంతి శాంతికాదు.

ధనికయుద్ధ స్థానంలో వర్గయుద్ధం రావలెను. ఈ రకమైన 'ప్రాక్టికల్ ప్రాపగండా'తో పాటు 'సిద్ధాంతభాగం' లోకూడా యెన్నో వ్రాసినాడు.

ఒక పద్ధతికి ఉచ్ఛదశయైన సామ్రాజ్యవాదాన్ని గూర్చి చక్కగా విమర్శించినాడు.

ప్రాతకాలవు యుద్ధాలకూ వీనికీ భేదం ఉన్నది. జమీందారీ పద్ధతిని కూలద్రోయడానికై చేసే యుద్ధాలు, సామ్రాజ్య త త్త్వం క్రింద పడి నలిగిపోతున్న ప్రజలు - మనవంటివారు - స్వతంత్రంకోసం చేసే పోరాటాలూ, అభివృద్ధికి దారి తీ స్తవి.

కానీ యీ సామ్రాజ్య యుద్ధాలు సర్వనాశంకర మైనవి. సామ్రాజ్య దోపిడీగాండ్రు ప్రపంచంలో తమ వాటాల కోసంచేసే కొట్లాట లివి.

ఇట్లా వ్రాయడమూ పనిచేయడమూ రెండూ జరుపుతూ వలసరాజ్యాలలోని స్వతంత్ర పోరాటాలనుకూడా వివరించి పరిచయం కల్పించుకొన్నాడు.

కొత్త యింటర్నేషనల్ స్థాపించే ప్రయత్నం 1915 బెర్న్ దగ్గర జిమ్మర్ వాల్డులో, అతివాద సోషలిస్టుల సమావేశంలో జరిగినది. లెనిన్ అభిప్రాయా లక్కడ ముందుకు రాలేదు. మెజారిటీ శాంతివాదులదే.

ఆసభ తర్వాత అతివాదులు ఒక కమిటీని ప్రచారం కోసం యెన్నుకొన్నారు.

లెనిన్, జినోవోవ్, రెడల్.

కీన్తల్‌లో జరిపిన రెండో సభలో లెనిన్ అభిప్రాయాలకు తావు చిక్కినది.

1916 ఏప్రెల్ 30, మే 1 తేదీలలో బెర్లిన్‌లో మహాసభ సమావేశం పూర్తి అయినది. లిబ్‌నెట్ అనే ఆయన సుప్రసిద్ధమైన అంతర్జాతీయ వ్యాసం చదివి

వినిపించినాడు. మరుసనాడే అరెస్టు అయినాడు.

అంతర్జాతీయ విధానం సమయానికి కాచుకొని ఉన్నది.

1917 మార్చి విప్లవం యీ పరిస్థితులను మార్చివేయ
గలిగినది.

—

## 6

యుద్ధ పరిస్థితులవల్ల రష్యాలో కలత యెక్కువైనది. మార్చి తొలిగోజులలో మరలా విప్లవం బయలుదేరినట్లు. కార్మికులందరూ సమ్మెలు చేయడం మొదలిడినారు. బజారులలో ప్రదర్శనాలు చేస్తున్నారు.

యుద్ధం ధ్వంసమై పోవుగాక.

జారుప్రభుత్వం నశించుగాక.

మాకు తిండి పెట్టండి.

ఇటువంటి వాక్యాలను ఉచ్చరిస్తూ బ్రహ్మాండమైన ఊరేగింపులు చేసేవారు.

ప్రభుత్వం దీనిని అణచివేయడానికి స్పెషల్ పోలీసులను పెట్టినారు. ప్రయోజనం సున్న.

ఈ విప్లవమంతా కేవలం కార్మికులదీ సోల్జర్లదీ మాత్రమే. పవరంతా వాళ్ళచేతులోనే ఉన్నది. వాళ్ళు ఉద్దేశాలూ ఆదర్శాలూ చక్కగా తెలుసుకొని అందుకు తగినట్లు ప్రవర్తించడానికి తగిన స్థితిలో లేరు. రాజకీయ పరిజ్ఞానం తగినంత వారికిలేదు. ఇందుకే మార్చినుండీ సెప్టంబరు వరకూ కథ నడిచింది.

కార్మిక సంఘాలూ ప్రతినిధులూ మెన్షివిక్కులమీద

విశ్వాసం కలిగి ఉండినారు. బోల్షివిక్కులు అప్పట్లో కొద్దిమంది.

మెన్షివిక్కులూ సో. రె. కలిసి బూర్జువావర్గంలో ఒక ప్రభుత్వం యేర్పడేట్టు చేసినారు. విప్లవంలో యే మాత్రమూ పనిచేయని బూర్జువావర్గము ప్రిన్స్‌లివోవ్, మిలికోవ్, లేబర్ పక్షానికి చెందిన కరెన్స్కీ కలిసి ఒక 'ప్రొవిషనల్ గవర్నమెంటు'ను ఏర్పరచినారు. ఈ రకంగా ద్వంద్వ ప్రభుత్వం స్థాపితమైనది. ఒక ప్రక్క ప్రొవిషనల్ గవర్నమెంటు. మరోవ్రక్క సోవియట్లు. కానీ యీమధ్య పరిపాలన సాగడానికి వీలులేకపోయినది. ఈ విప్లవాన్నిగూర్చి లెనిన్ విన్నవెంటనే రష్యాకు రావలె ననుకున్నాడు. అందుకు ప్రభుత్వం అనుమతి కావలెను.

అది చాలా దుర్లభం.

ఎన్నో ప్రయత్నాలుచేస్తే సీలుచేసిన రైలుపెట్టెలో పోవడానికి జర్మనీ సమ్మతించినది.

ఇందు మూలాననే లెనిన్ జర్మనీ యేజంటని అపవాదులు వేయడానికి ప్రభుత్వం సాహసింప గల్గినది.

లెనిన్ ఏప్రిల్ 16 తేదీ పెట్రోగ్రాడుకు విచ్చేసినాడు. లెనిన్ రష్యాకు పోకముందే, విప్లవాన్ని గురించీ, ముం

దుకు పోయే మార్గాన్ని గురించీ ఆలోచిస్తున్నాడు.

రష్యాకు వచ్చి పరిస్థితులు చక్కగా గమనించినాడు. సోవియట్లు మెన్షివిక్కుల ఆలనపాలనలలో ఉండడం, వారు బూర్జువాల అడుగులకు మడుగులొత్తుతూ ఉండడం కని పెట్టినాడు.

ఇందువల్ల 'ప్రస్తుత విప్లవంలో కార్మికుల కర్తవ్యం' అనే పేర నవంబరు విప్లవానికి రహదారి చూపెట్టినాడు. ముక్తసరిగా ముగించవలసివస్తే దాని సారాంశమిది:

సామ్రాజ్య యుద్ధాలలో మనం చేయిచేసుకోరాదు. ఈ విప్లవం మూలానవే అధికారాన్ని కార్మికుల హస్తాలలోనికి తీసుక రావలెను. ప్రస్తుతమున్న ప్రావిషనల్ గవర్నమెంటుతో సహకారం చేయరాదు. సోవియట్లలో స్వల్ప సంఖ్యలో ఉన్న బోల్షివిక్కులు బాగా ప్రచారంచేసి అధిక సంఖ్యను సంపాదించుకోవలెను. సోవియట్లుకు అధికారం ఒప్పగించవలెను. పార్లమెంటరీ ప్రజాస్వామికం మనకక్కరలేదు; కార్మిక కర్షక ప్రభుత్వం కావలెను. భూమి నంతనూ బాంకులనూ సమాజపరం చేయవలెను. సోషలిజానికి పునాది వేయడమే కాదు, లక్షణమే ఉత్పత్తి - పంపకాల అధికారం సోవియట్లకు రావలెను. పార్టీ కాంగ్రెసు జరుపవలెను.

కార్యక్రమాన్ని తిరిగీ విమర్శించి తగిన విధంగా సంస్క రించుకోవలెను. క్రొత్తగా విప్లవ తత్త్వంగల 'ఇంటర్నేషనలు' ను స్థాపించవలెను.

ఇందులో రష్యా పరిస్థితులను మార్క్సు తత్త్వదృష్టితో చూచి చక్కగా వివరించినాడు కర్తవ్యాన్ని.

కానీ యిది చాలామంది మితవాదులకు నచ్చలేదు. వారీవిషయాలను అవగాహనం చేసుకోలేక పోయినారు.

బోల్షివిక్కు నాయకులలో చాలామంది - స్టాలిన్ కూడా - యీ కార్యక్రమాన్ని వెంటనే ఆచరణలోనికి తీసుక రావలె ననుకున్నారు. అందుకై చాలామంది తీవ్ర ప్రచారం సాగించ నారంభించినారు.

లెనిన్ ప్రతిదినమూ, యీ విషయాలను గురించి ఉపన్య సిస్తుండే వాడు. 'ప్రవదా' పత్రికలో వ్యాసాలు వ్రాస్తూండేవాడు.

ఏప్రిల్ కడపట మాస్కోలో పార్టీ మహాసభ జరిగినది. అందులో లెనిన్ కార్యక్రమమే ఆచరణీయమని తేలి పోయినది. ఏకగ్రీవంగా ఒప్పుకున్నారు.

అప్పటి ప్రభుత్వం యుద్ధానికి అనుకూలంగా ఉన్నందుకు

తమ అసమ్మతిని కార్మికులూ సైనికులూ అనేక విధాలుగా చూపించినారు.

ఇందువల్ల కొందరు మంత్రులు రాజీనామా నివ్వడం 'కోయెలిషన్' గవర్నమెంటు స్థాపితం కావడం జరిగినది. ఇందులోనూ కెరెన్స్కీ యొక్కువ పలుకుబడి ఉండింది.

ఈ సమయంలో లెనిన్ పేరు నలుదిక్కులా మ్రోగినది. ప్రతివాడును అతని రచనలు చదవడం కోసం, ఉపన్యాసాలు వినడం కోసం తహతహ పడేవాడు.

ఇతని వాగ్ధాటి నయాగరా ప్రపాతం వంటిదేమీ కాదు. ఇతరుల మనస్సుకు నాటేటట్లు విశదంగా, సకారణంగా నచ్చజెప్పేవాడు. హృదయ పూర్వకమైన ఆవేదనను అనుభవిస్తూ చెబుతూన్న అతనిమాటలు ప్రజల హృదయాలను కదలించి వేయడంలో ఆశ్చర్య మేమున్నది? లెనిన్ వచ్చిన ఒక నెల కంతా ట్రాట్స్కీ వచ్చినాడు. అతడు గొప్పవక్త. వచ్చిన కొద్దిరోజులలోనే బొల్షివిక్కుల పార్టీలో లెనిన్‌కు రెండో స్థానం సంపాదించుకొన్నాడు.

ఇతని వాగ్ధోరణి శత్రువుల గుండెలను అవియింప జేయగలది. పేదవారి గుండెలలో ఉడుకురక్తాన్ని నింపి విప్లవగీతాలను వినిపింప గలిగినది.

కానీ, లెనిన్ కర్తవ్యాన్ని అర్థమయ్యేటట్టు నిదానంగా తెలిపేవాడు. ఇతడు ఆవేశాన్ని కలిగింప జేసేవాడు.

ఇదంతాచూచి ధనికవర్గమంతా హడలిపోయినది. వారికి లెనిన్ మూలచ్ఛేదకుడుగా కనిపించినాడు.

ఇంకేమీ తోచక యితడు జర్మన్ యేజంటని ప్రచారం మొదలు పెట్టినారు. ప్రత్యక్షంగా లెనిన్‌పైన యీ ప్రవాదం మోపినారు.

యుద్ధానికి విరుద్ధంగా ప్రచారం చేయడం అప్పటి చట్టాన్నిబట్టి విరుద్ధంకాదు; కాబట్టి జర్మనీ ప్రభుత్వంతో సంబంధం కలిగి ఉన్నాడని నీలాపనింద నెత్తిమీద వేసినారు.

కరెన్‌స్కీ అతని యేజంట్లూ యీ విషయాన్ని 'బ్రిడ్ కాస్టు ఉపన్యాసాలద్వారా తెలిపినారు.

ఇందువల్ల లెనిన్ మరీ తెరవెనుకలికి పోవలసి వచ్చినది. కార్మిక నాయకులెందరినో అరెస్టు చేసినారు.

జులై నెలలో యెన్నో విప్లవ ప్రతిక్రియలు జరిగినవి. విషమ పరిస్థితులే తిరిగీ విప్లవం జరగడానికికారణమైనవి. ఈ సమయంలో లెనిన్ పెట్రోగ్రాడు సమీపంలో ఒక కార్మికుని యింటిలో ఉన్నాడు. తర్వాత ఫిన్లాండు

సరిహద్దులో ఒక పర్ణశాలలో ఉండినాడు. కడపట 'హెల్సింగుఫోర్స్'లో ఒక ఇంటర్నేషనలిస్టు సో. డెమొ క్రాటు అయిన పోలీసు అధికారి యింటిలో ఉండినాడు. అక్కడ నుండే తెరవెనుక నాటక మాడిస్తుండినాడు.

ఇప్పుడు మరీ సిద్ధాంత భాగాలలో యెక్కువగా పని చేస్తూ వచ్చినాడు.

'రాజ్యాంగ యంత్రమూ విప్లవమూ' అనే పుస్తకం వ్రాసినాడు. కానీ అది పూర్తిగా వ్రాయకముందే కార్య రంగంలోకి దూకవలసి వచ్చినందువల్ల మానివేసి నాడు.

అది ప్రథమంలో ముద్రించే టప్పుడు పోస్టుస్క్రిప్టులో యిట్లా వ్రాసినా డతనే.

'విప్లవాన్ని గురించి వ్రాయడంకన్నా, విప్లవంలోదిగి అనుభవం సంపాదించుకోవడం చాలా ఆనందదాయకమూ లాభదాయకమూ కూడా.

---

శ్రీ జీవన గ్రంథాలయము,
తేలప్రోలు.

# 7

ఇతని జీవితంలోని ముఖ్యభాగం విప్లవమే. దీనిమూలం గానే ప్రపంచాన్నంతటినీ విస్తుపోయి విలోకించేటట్లు చేసినాడు లెనిన్.

ప్రపంచాన్ని ఒక శాస్త్రీయదృష్టితో పరికించి, ఏరకం గానైతే యీకష్టభరితలోకం, సౌఖ్యభరిత మౌతుందో వివరించినాడు మార్క్సు.

ఆదృష్టితోనే అప్పటి పరిస్థితులను సమన్వయించి ఒక రూపమునిచ్చి జయప్రదంగా విప్లవాన్ని నడిపినాడు. మార్క్సు చెప్పిజూపితే, ఇతడు చేసిచూపినాడు.

కార్నిలోవ్ ఈ విషమ పరిస్థితులు ఎక్కువైపోతున్నా యని తెలిసేటప్పటికి కార్యరంగంలోకి దిగి పనిచేయ డానికి తగిన సమయమిది అనుకున్నాడు.

అప్పుడే సెంట్రల్ కమిటీతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపినాడు సెప్టంబరు ఆఖరులో.

ప్రజాప్రతినిధి సభను కరెన్స్కి పిలిచినా బోల్షివిక్కు లందరూ 'ప్రజాతంత్ర మహాసభ'లో పాల్గొన్నారు. ఫలితం కొామెలిపర్. కానీ పరిస్థితులు నానాటికీ బిగుసు కొని గవర్నమెంటుకు విరుద్ధమైపోతున్నవి. రైతులకు యిస్తామన్న భూమి యివ్వక పోయినందున గొప్ప సంచ

లనం వారిలో బయలుదేరినది.

కొందరు ప్రతినిధులువచ్చి సైన్యమింక చాల కాలం యుద్ధం చేయలేదనీ తొందరలోనే బయటికి వచ్చివేస్తుందనీ చెప్పినారు. నిర్మాణ విధానమంతా నాశనమై పోతున్నది. రైల్వేలన్నీ నిలిచిపోతున్నవి. షావు కార్లందరూ తమ పనులను కట్టిపెట్టి జనసామాన్యంలో నిరుద్యోగాన్ని యెక్కువ చేసినారు.

దీనితోపాటు ప్రజలలో బోల్షివిక్కులపైన అభిమానం యెక్కువైనది. ముఖ్య రాజధానులుగావున్న పెట్రోగ్రాడులోనూ మాస్కోలోనూ ఇతర ముఖ్యపట్టణాల్లోనూ సోవియట్లలో బోల్షివిక్కులకు మెజారిటీ వచ్చినది. పెట్రోగ్రాడు సోవియట్టుకు, ట్రాట్స్కీ అధ్యక్షుడుగా యెన్నుకొనబడినాడు.

మునిసిపల్ యెలెక్షన్లలోకూడా బోల్షివిక్కులకు ప్రాబల్యం కలగడం మొదలుబెట్టినది. మాస్కోలో నూటికి 51 ఓట్లు వీరికి వచ్చినవి. చాలామంది రైతుసోవియట్లు, బోల్షివిక్కులు కాకపోయినా ధనికులతో సహకారం చేయకూడదనే బోల్షివిక్కుల విధానాన్ని తీసుకొన్నారు.

గవర్నమెంటు లోపలకూడా, అతివాదు లెక్కువైనారు. 'ఇంటర్నేషనలిస్టు మెన్షివిక్కులు' మార్టోవ్ నాయకత్వం

క్రింద్రా, సో. రె. అతివాదులూ పూర్తిగా లెనిన్ వైపే మొగ్గుతున్నారు కానీ, కరెన్స్కీతో చేరడంలేదు.

లెనిన్ యీసమయంలో యెంతో పని చేసినాడు. సెంట్రల్ కమిటీకి చక్కగా వుత్తరాలు వ్రాసినాడు. ఇదే పరిస్థితే కొన్నాళ్ళుంటే దేశం నానాక్షోభ పాలౌతుంది. ఈ స్థితిలో తిరిగీ ధనికవర్గ మేమైనా చేయవచ్చు.

ఎట్లయినా సైన్యాక్రమణంతో తప్ప కార్యం లేదు. ప్రస్తుత ప్రభుత్వంపైన యెవ్వరికీ యిష్టంలేదు. అది ఇతనితో ట్రాట్స్కీ స్టాలిన్ మొదలైన వాళ్ళందరూ సహకారం చూపిస్తున్నారు. కానీ పార్టీలో చాలా మంది సైనికాక్రమణానికి ఒప్పుకోకుండా ఉన్నారు.

ఈ సమయంలోనే లెనిన్ 'ఆలస్యమంటే మరణప్రాయం' అన్నాడు. ఆ వాక్య మంతటా ప్రతిధ్వనించింది.

అక్టోబరు 23 తేదీ బోల్షివిక్కు పార్టీ సెంట్రల్ కమిటీలో సైనికాక్రమణకు అనుకూలంగా ఆఖరు నిర్ధారణ జరిగినది. ఇందులో అందఱూ అనుకూలమే. యిద్దరు మాత్రం వ్యతిరేకం.

ఆ నిశ్చయ ప్రకారం నవంబరు 6 తేదీరాత్రి, 7 తేదీ ప్రభుత్వాధికారాన్ని విజయవంతంగా దొరక బుచ్చుకొన్నారు.

ప్రభుత్వం ఏమూలకూడా తన్ను రక్షించుకో గలిగిన స్థితిలో లేదు.

ఆదినమే రెండవ సోవియట్ కాంగ్రెస్సు జరిగి అందులో అధికారరీత్యా క్రొత్త ప్రభుత్వ ప్రకటన జరిగినది. ఈ సమయంలో రాజధాని అంతా 'మిలిటరీ రివల్యూషనరీ కమిటీ' చేతిలోనే ఉన్నది. కాని 'మిలిటరీపాలిసీ' మాత్రం గవర్నమెంటు చేతిలోనే ఉన్నది. కరెన్స్కీ తప్పించుకున్నాడు. కొంత నేపటి కదీ పట్టుకున్నారు. అప్పుడు విజయాన్ని లెనిన్ ప్రకటించినాడు. జూలై నుంచీ కనబడకుండా లోలోననే యింతపనీ చేస్తుండినాడు. ఇప్పుడు బయట కనబడేటప్పటికి ఎంతో ఉత్సాహంతో ప్రజలు జేజేలు పలికినారు.

మరునాడే క్రొత్త ప్రభుత్వ కార్యవర్గం ఏర్పరచినారు. దానికి లెనిన్ ప్రెసిడెంటు. ట్రాట్స్కీ విదేశాలలో కార్యకర్త. దీనికి 'ప్రజాప్రతినిధి పరిషత్తు (Soviet Narodrykh Komissarov) సంక్షిప్తనామం Sov-narkam ఇంతలో ఇంటర్నేషనలిస్టు మెన్షివిక్కులూ, సో. రె. లు అందఱూ కలిసి ఏకముఖంగా చేసిన రాజ్యాంగ విధానం కావలెనని ఆందోళన సాగించిరి.

బోల్షివిక్కులలోకూడా చాలామంది యితర పార్టీలను

కూడా చేర్చుకుంటేనే తప్ప లెనిన్‌తో సహకారం చేయ మన్నారు.

లెనిన్ దీనినిగూర్చి యెంతో ఆలోచించినాడు. పార్టీ వ్యక్తుల అభిప్రాయాలే కానీ మొత్తంమీద తన అభి ప్రాయాలకే పార్టీ ఒప్పుకుంటుందని తెలుసుకొన్నాడు.

అందులో తాను ప్రజలకిచ్చిన వాగ్దానాలన్నీ మఱచి పోలేదు. కనుక కొన్ని నియమము లేర్పరచి వీని కంగీక రించే వాళ్ళను మాత్రమే చేర్చుకుంటా మన్నారు. నియమా లేవంటే:

అధికారమంతా సోవియట్లకే ఉండవలెను. తక్షణమే యుద్ధము ఆపడానికి తగినచర్య తీసుకోవలెను. రష్యాలో నున్న రాష్ట్రాలన్నిటి స్వాతంత్ర్యాన్నీ ఒప్పుకోవలెను. వెనువెంటనే భూమిని సమాజపరం చేయువలెను. పరిశ్రమ లన్నీ కార్మిక పాలనలో ఉండవలెను. బూర్జువా లం దరూ తప్పక పనిచేయునట్లు చేయవలెను.

ఈ నియమాలకు మార్టోవ్ ఒప్పుకోలేదు. సో. రె. అతివాదు లంగీకరించడానికి సిద్ధంగా ఉన్నా రైతు సోవి యట్ కాంగ్రెసు త్వరలోనే జరగబోతుంది కాబట్టి దాని అభిప్రాయంకోసం వేచియున్నారు.

లెనిన్ సోవియట్లవైపు రైతులను త్రిప్పుకోవలెను.

ఇంతకుముందు 1905 విప్లవ మప్పటినుంచీ రైతుసమస్య యితని ఆలోచనలో ఉన్నది.

ఆప్రకారమే సోవియట్ కాంగ్రెసులో 'లాండ్ డిక్రీ' 9 నవంబరు పాసు చేయించినాడు.

ఆడిక్రీ స్పష్టంగానూ కొద్దిగానూ ఉన్నది. భూములన్నీ రైతులపరం చేయవలెననీ వానిని రైతులే యెన్నుకొన్న స్థానిక భూసంఘాల చేతుల్లో ఉంచవలెననీ.

లెనిన్ యింకా ముందుకు పోవా లనుకొన్నాడుకానీ రైతు ప్రతినిధుల సలహాల ప్రకారం ఒక లా పూర్తిగా యింకా కావలసిన వసతులనుబట్టి పూర్తిగా వ్రాయ వలె ననుకొన్నాడు.

రైతు కాంగ్రెసు యిందుకు ఒప్పుకున్నది. లెనిన్ రైతు ప్రతినిధులైన సో. రె. కు మూడు స్థానాలు, రైతాంగ ప్రతినిధి స్థానంతోకూడా యిచ్చినాడు కార్యవర్గంలో.

సోవనర్కూం (సోవియట్ ప్రభుత్వం) బోల్షివిక్కు ప్రణాళి కను చక్కగా నెరవేర్చినది. కొన్ని వారాలలోనే బాంకులను సమాజపరం చేయడం, పరిశ్రమలు కార్మికా ధీనం చేయడం, బూర్జువాలు తప్పని సరిగా పనిలోచేరే టట్లు చేయడం మొదలైన పనులన్నీ సాగించినది.

బూర్జువాలు దీనిని కక్కాలేక మింగాలేక ఉన్నారు. ప్రతి విప్లవం బయలుదేరుతుందని దానిని అణచి పార వేయడానికి ఒక ప్రత్యేక సంఘాన్ని నియమించినారు.

ఇంక 'కాన్స్టిట్యుయెంట్ అసెంబ్లీ' సమస్య ఉన్నది. ఈవిప్లవానికి కొన్ని వారాలకు ముందే నామినేషనులు జరిగినవి. తర్వాత కొన్నివారాలకు ఎన్నికలు. ఇందులో సో. రె. లకు మేజారిటీ వచ్చినది.

ఈ సభ 1918 జనవరి 18 తేదీ సమావేశమైనది. దీనిని సోవియటు ప్రభుత్వం ఒప్పుకొనలేదు. ఆరాత్రే ఆసభను రద్దుచేసి వేసినారు.

దీనికి కారణాలను లెనిన్ 'థీసిస్ ఆన్ కాన్స్టిట్యుయెంటు అసెంబ్లీ' అనే వ్యాసంవ్రాసి 'ప్రవదా'లో జనవరి 8 తేదీ ప్రకటించినాడు.

బూర్జువా మర్యాదలతో చట్టబద్ధమనే రకంతో మనం ఒప్పుకోరాదు. కార్మికులకూ కర్షకులకూ సోల్జర్లకూ ప్రాతినిధ్యం వహిస్తూన్న సోవియట్ల అభిప్రాయ ప్రకారమే పోవలెను.

ప్రజాతంత్రమని పేరుపెట్టడంలో లాభంలేదు. అసలది సమ సమాజంలో కానీ సాధ్యంకాదు.

దీనితో రష్యా సోవియట్ రిపబ్లిక్కుగా నిర్ధారితమైనది. ఈ క్రొత్త ప్రజాస్వామికానికి చట్టముమాత్రము అయిదో సోవియట్ కాంగ్రెసు (1918 జూలైలో) లో నిర్ధారిత మైనది. ఏడవ సోవియట్ కాంగ్రెస్‌లో లెనిన్ తమ పార్టీ పేరు 'కమ్యూనిస్టుపార్టీ' అని మార్చవలెనని ప్రతిపాదించి నాడు. అదినగ్గి అప్పటినుండీ 'కమ్యూనిస్టుపార్టీ' అని పిలువబడు తున్నది.

ఈ పదం తొలుత మార్క్సు ఏంజిల్సులు 1848 ప్రాంతంలో 'కమ్యూనిస్టు మానిఫెస్టో' అన్నారు.

కమ్యూనిజమనేది సోషలిజంయొక్క పరిపూర్ణావస్థ.

| | |
|---|---|
| శక్తికొలది పని<br>పని కొలది జీతము | సోషలిజం |
| శక్తి కొలది పని<br>అవసరముకొలది జీతము | కమ్యూనిజం |

ఈపేరు పెట్టడానికి కారణం సోషల్ డెమొక్రాటులు రెండవ ఇంటర్నేషనల్‌ను అనుసరిస్తూ ఏరోటి కాపదంపాడే రకానికీ తమపార్టీకి ఉన్న భేదాన్ని తెలపడానికే.

---

రష్యాలో బోల్షివిక్కు విప్లవం విజయవంతమై ప్రపంచ విప్లవ సముద్రమును చూపుమేరలోనికి కొనివచ్చినది.

1918 జనవరిలో ఆస్ట్రియాలోనూ జర్మనీలోనూ సమ్మెలు బలవంతంగా చూపట్టినవి. కానీ అంతకన్నా బలవంత ములై బూర్జువా ప్రభుత్వాలు పాముకొనినవి. 'బ్రెస్టు లిటొవిస్కు పీస్' 'రాబర్స్పీస్'లలో సంతకం పెట్టినారు. ఇందుకు పార్టీలో కొన్ని చీలిక లేర్పడినవి. కడపటికి నిర్ధారణ జరిగినది. ఈ కాలంలో లెనిన్ కొన్ని వ్రాతలు వ్రాసినాడు. అప్పటి ప్రపంచ పరిస్థితినంతా గమనించి నాడు.

ఒక్కసారిగా యితర దేశాలలోకూడా సోషలిజాన్ని స్థాపించడానికై ప్రయత్నించడాని కన్నా - పరిస్థితులు సరిగాలేవు కాబట్టి - విప్లవం విజయవంతమైన రష్యాను చక్కని మార్గంలో నడపడం మంచిది కాదా.

లెనిన్ అప్పుడనుకున్న వన్నీ చెప్పినవన్నీ చక్కగా జరిగిన వనవచ్చు.

1918 నవంబరులో జర్మన్ శ్రామికవర్గం చెలరేగినది. కైజరిజాన్ని పడగొట్టినది. బ్రెస్టుసంధి రద్దైనది. యుద్ధం ముగిసినది.

1918–22 ప్రపంచ విప్లవ తరంగాలు తలసూపినవి.

సామ్రాజ్య యుద్ధం ముగిసిన తర్వాత అంతర్యుద్ధాలు అక్కడక్కడా కనుబడినవి. దండయాత్ర లెక్కవైనవి. అప్పుడు సామ్రాజ్యవాదు లందరూచేరి అప్పుడప్పుడే పొడిసూపిన సోవియట్ రిపబ్లిక్కును పడగొట్టడానికి ప్రబల ప్రయత్నం చేసినారు కాని లెనిన్ వల్ల అవన్నీ వ్యర్థమైనవి.

అక్కడ వున్న విద్రోహులు యితరుల సాయంతో కడకు వ్యక్తిగత హింసా విధానానికికూడా పాల్పడినారు.

మాస్కో దక్షిణ భాగంలో కార్మిక సభలో ఉపన్యసించి లెనిన్ మోటారుకారులో యెక్కేటప్పు డొకామె కాల్చినది. ఊపిరితిత్తులలో గుండొకటి దూరినది.

అప్పు డతనిని యెత్తుకొని పోతామన్నారు. కానీ అక్కరలేదని అట్లే యింటికి నడచి పోయినాడు.

గాయములు కొన్ని రోజులలో బాగుపడినవి. కానీ యితని ఆరోగ్యాని కాసన్నివేశం చాలా భంగాన్ని కల్గించినదని చెప్పక తప్పదు.

అంతర్యుద్ధమంతా కడకు రూపుమాసి పోయినది.

సోవియట్ రాజ్యాన్ని నాశనం చేయడానికై ప్రయ

త్నించిన శక్తులన్నీ అణగారి పోయినవి.

1919 వసంతంలో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ స్థాపించబడినది.

1921 నుండి పరిస్థితులన్నీ నవత్వాన్ని పొందినవి. ఈ సమయంలో యితడెన్నో పుస్తకాలు వ్రాసినాడు.

---

1921 మార్చిలో 10 వ పార్టీ కాంగ్రెసులో 'నెప్' (న్యూ ఎకనామిక్ పాలసీ) విధానాన్ని వివరించినాడు లెనిన్.

ధనిక తత్వం యెన్నోయేండ్లు పాదుకొని ఉన్నది. ఇటు వంటిదాని నొక్కమారుగా తీసివేయవలె నంటే సాధ్యం కాదు. అందుకోసం యీ విధానాన్ని సూచించినాడు. స్వతంత్రంగా అంగళ్లుపెట్టి వ్యాపారం చేసుకోవడానికి హక్కునిచ్చు పన్నులు అధికంగా రానురానూ యింకా అధికంగా కట్టుతూ యీ తత్వాన్ని నిర్మూలించడం సుసాధ్యం అనుకున్నాడు. విదేశ వ్యాపారం మాత్రం ప్రభుత్వమే నడుపుతుంది.

1921 లో గొప్ప కరువు సంప్రాప్తమైనది. అదొక్క యేడు పీడించినది.

1922 మార్చిలో 11 వ పార్టీ కాంగ్రెసు జరిగినది. ఆ సమయంలో అంతా చచ్చుగా ఉన్నది.

27 మార్చిలో లెనిన్ యిచ్చిన ఉపన్యాసం అగని వార్తలలో ముఖ్యస్థానాన్ని ఆక్రమించ గలది.

రైతులను గూర్చిన విషయా లెన్నిటినో యిందులో చక్కగా వివరించినాడు.

ధనికులు కేవలం తమ లాభాలకోసం వ్యాపారం చేస్తారు. 'సెప్ మెర్క' అట్లాకాదు. కేవలం కమ్యూనిస్టు అభిప్రాయాలను కాపాడుతూ ఇతర ధనికుల పోటీని నివారించడానికై ప్రయత్నించవలెను.

అప్పుడతను చెప్పినమాటలలోని ఒక్కమాట ప్రతి మనిషీ జ్ఞప్తికి ఉంచుకొనవలసినది.

"జన సామాన్యంలో మనము సముద్రంలో జలకణము వంటి వాళ్ళము. మనము వారిని పాలిస్తున్నామంటే జన సామాన్యపు అభిప్రాయాలను వెల్లడిస్తున్నాము గనక"

పై మాటలలో ఉన్న అభిప్రాయమే అతని చర్యలను మనకు వెల్లడిస్తుంది.

అదే ప్రకారమే సోవియట్ పవరు స్థాపించిన వెంటనే రైతు సమస్యను విడదీసినాడు. ఆర్థిక పరిస్థితులను చక్కబెట్టడానికై యెన్నో యెత్తులు వేసినాడు.

ఇన్ని విధాలా యితరులతో పోరాడుతూనే తన దేశంలోని పరిస్థితులను చక్కబెట్టుతూ వచ్చినాడు.

ఒక విషయమూ అతను యెదుర్కొనవలసినది! ఇంత భారము మోయడమంటే!

ఇన్నిపనులు చేసేటప్పటికి అతని ఆరోగ్యం పాడైపో

నారంభించినది. 1922 కాంగ్రెసులోనే ఇంతకు ముందు వలె పనిచేయలేక పోయినాడు.

మే నెలలో అతని కుడిచేయీ కుడికాలూ పడిపోయినవి. వాని నతడు ఉపయోగించుకొన వీలులేక పోయినది.

జులైలో మరి యితను కొంత కోలుకొన్నాడు. అక్టోబరు కంతా చాలా గుణం కన్పించినది. అందువల్లనే యితడు పనిలో పాల్గొంటున్నాడని అధికార రీత్యా ప్రకటింప బడినది.

ఇతడైనా యెక్కువ పనిచేయలేక పోయినాడు. కానీ ఆ ఉత్సాహమూ ఆ ప్రతిభ మాత్రం ఏ కొంచెంకూడా వెనుక బడలేదు.

మాస్కో సోవియట్ సెంట్రల్ ఎగ్జిక్యూటివ్ కమిటీ లోనూ, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నాల్గో కాంగ్రెసు లోనూ, ఉపన్యసించినాడు.

మరీ డిసెంబరులో ఆరోగ్యం వెనక బట్టింది. నిర్మాణ కార్యక్రమంలో పాల్గొనడం తగ్గించినాడు కానీ వ్రాత మాత్రం సాగిస్తూనే వచ్చినాడు.

ఈ 1923 జనవరీ మార్చి ప్రాంతాలలో వ్రాసిన వ్రాతలు లెనినిజమునకు పెట్టని భూషలు. విప్లవాన్ని అర్థం

చేసుకోవడానికి చక్కని మార్గదర్శకములు. ఆడిట్ శాఖను గూర్చి కడపట వ్రాసిన వ్యాసము కడు మెచ్చుకో దగినది.

ఇతని కట్టకడపటి వ్యాసం 'సహకారంమీద' (on Co-operation) రైతు సమస్యను ప్రస్తుత పార్టీ కార్య క్రమాన్ని విమర్శించి గ్రామ రష్యాను సోషలిస్టు రష్యా గా మార్చవలెనని యెన్నో శాస్త్రీయ సూచనలు చేయ బడినవి.

మార్చి 9 తేదీ అనారోగ్యం మరొక తాకు తాకినది. ఆ దెబ్బతో ఏ విధమైన పనీ చేయలేక పూర్తిగా విశ్రాంతి తీసుకోవలసి వచ్చినది.

మాస్కో ప్రాంతంలో గ్రామంలో ఉన్న గోర్కీ యిం టికి జీవితశేషాన్ని గడపడానికి వెళ్ళినాడు. ఇట్లనే 1923 ఆఖరు వరకూ పూర్తీ కష్టం అనిపించే పరిస్థితేమీ కలుగలేదు.

1924 జనవరి తొలిరోజుల్లో తిరిగీ బాగౌతుందా అనిపించే టట్టు కొద్దిగుణాలు కనిపించినవి.

తలవని తలంపుగా అంత్యకాలం సమీపించినది.

1924 జనవరి 21 తేదీ సాయంత్రం 6-50 గంటలకు ప్రాణం విడిచినాడు.

అతని దేహమిప్పటికీ రష్యాలో రసాయన శాస్త్రజ్ఞుల ప్రతిభా సామర్థ్యంవల్ల అట్లనే ఉన్నది.

ప్రతి కార్మికుడూ ప్రతి ప్రజా దానివైపుచూచి ఆ దివ్య వ్యక్తిచేసిన కార్యాలను హృదయంలో ఒక్కమాటు తలంచుకొని తలమోకరించి ఆనంద బాష్పాలనో అశ్రుకణాలనో విడువక పోడు.

ధన్యజీవీ! జోహారులు. నీ అమేయ ప్రతిభావిశేష మిప్పటికీ ప్రపంచాన్ని దిగ్భ్రమచెందిస్తున్నది.

నీవు చూపిన దారితప్ప వేరే యింకొకటిలేదని అక్షరాలా రుజువైనది. నీవుచేసిన నిర్మాణకార్యక్రమం శిలాలిఖితమువలె నిశ్చలమై కనిపిస్తున్నది.

నీవు వెల్గించిన ఆనందజ్యోతి ప్రపంచంలో ఉన్న అంధకారాన్నంతా తొలగించక పోతుందా?

---

శ్రీ వేమన గ్రంథాలయము,
తేలప్రోలు.

లెనిన్ను గురించి మనము తెలుసుకొన్నామంటే ఒక రష్యన్ నాయకుడుగానూ, అంతర్జాతీయ నాయకుడు గానూ.

కానీ అతని హృదయాన్నీ అతని స్వభావాన్నీ, సామాన్యమానవుడుగా పరికించినా యెంతో గొప్పదనం కనిపిస్తుంది.

ఇతని జీవితాన్ని రష్యావిప్లవకథనూ విడదీయడమేకష్టం. మెన్షివిక్కు నాయకుడు 'డాన్' చెప్పినట్లు పొద్దస్తమూ విప్లవాన్నిగూర్చే చింతిస్తాడు; నిద్రపోతూ విప్లవాన్నే స్వప్నవీధుల్లో తిలకిస్తాడు.

నిరాడంబరజీవి. తన జీవితావసరాలకై సెంట్రల్ కమిటీ మెంబరుగా ఉన్నందుకో పార్టీ పేపరుకు ఎడిటరుగా ఉన్నందుకో యిస్తున్న జీతంతో సరిపుచ్చుకొనేవాడు. ఇతని ఉద్దేశ్యంలో నేర్పరియైన చేతిపనివానికీ, తెలివిగల వానికీ ఒకే జీతమే యివ్వవలెనని. సెంట్రల్ కమిటీ మెంబర్లు ప్రెస్సులోని పనివారికంటె యెక్కువతీసుకొనే వారుగాదు. అతని భార్య అన్నట్లు ఏవిధంగా జీవితాన్ని ఆనందమయంగా చేసుకోవాలనో అతనికి తెలుసు.

ఇదే అభిప్రాయాన్ని గవర్నమెంటు సర్వాధికారి అయినప్పుడుకూడా సాగించినాడు.

ఇతడు విశ్రాంతికాలంలో ప్రక్కని పల్లెటూరికి వెళ్ళి బందూకా వేటతో కాలం బుచ్చేవాడు. విలాసప్రియుడు కాదు. ద్రాక్షారసాన్ని ఎప్పుడూ త్రాగియెరుగడు. మాంసముకూడా తినేవాడు కాదు. కానీ అదొక నియమము అన్న అభిప్రాయంమాత్రం అతనికి లేదు.

ఆత్మసంయమము యెక్కువగా కలవాడు. ఎన్నడూ యితరుల ప్రత్యేక జీవితాలనుగురించి పేర్లుపెట్టడు. అయితే సహచరుల జీవితం వ్యర్థమైన మాటలతో గడచిపోవడానికి ఒప్పుకొనడు.

ప్రకృతిసౌందర్యాన్ని పరమానందంతో చూచేవాడు. స్విడ్జర్లండులోనూ గ్లలీషియాలోనూ ఉన్నప్పుడు కొండలకు వెళుతుండేవాడు.

ఇతనికి సంభాషణ ఒక సాధనమేకాని అదే పరమార్థం కాదు. అయితే సంభాషణకు ఫలితార్థమేమైనా ఉన్నప్పుడు మాత్రం చాలా ఆదరంతో మాట్లాడుతాడు.

ఇతడు పారిస్‌లోనూ, బ్రిటీషు మ్యూజియంలోనూ యెంతో చదివినాడు. మార్క్సిజమునుగూర్చి యితను చేసిన కృషి చెప్పవలసిన అవసరమే లేదు.

అట్లే అనేక యితర విషయములెన్నో ఆలోడన చేసి

నాడు. సభ్యతా పరిపూర్ణుడు. పుష్కిన్ టాల్స్టాయి మొదలైన రష్యన్ సుప్రసిద్ధ కవుల పుస్తకాలను చక్కగా చదివినవాడు.

మార్క్సిస్టు అన్న వెంటనే అతనికొకటి కాదు రావలసినది. సాంఘిక శాస్త్రము, రాజకీయ తత్త్వశాస్త్రములు, చరిత్రలు, అంతర్జాతీయ వివరాలు, వైజ్ఞానిక శాస్త్రాలు అవీ యివీయేమి? సభ్యతకు కావలసిన సర్వ విషయాలూ తెలియవలెను.

ఇవన్నీ యితనికి చక్కగా తెలుసు. కాబట్టే అచ్చం మార్క్సిస్టు.

ఇంక యితని రచనలనుగూర్చి వ్రాయవలెనన్న అదొక ప్రత్యేక పుస్తక మౌతుంది.

ఎన్నో పుస్తకాలు వ్రాసినాడు. ఎన్నో వ్యాసాలు వ్రాసినాడు. ఎన్నో ఉపన్యాసా లిచ్చినాడు.

ఇతని 'యింపీరియలిజం' పెట్టుబడి విధానం యేవిధంగా సామ్రాజ్యవాదంగా పరిణమించి ప్రపంచ యుద్ధాలకు కారణమయ్యేదీ బహు సునిశితంగా తెలుపుతుంది. ఇట్లే ప్రతిదీ కూలంకషమైన చర్చగా ఉంటుంది.

ఇతని రచనలలోని గొప్ప విశేషము, కేవలం తాత్త్విక

రచన లన్నిటివలెనే, గళగాంభీర్యాలు కావు.

హృదయాన్ని తాకేటట్టు సునిశితంగా చెప్పేశక్తి ఉన్న దితనికి.

'తనకు తెలిసినదానికన్నా యెక్కువ చెప్పని విప్లవకారు డైన రచయిత యితడొక్కడే. అయినా యితర విప్లవ కారులకన్నా ఎంతో గొప్పదనం యితనిరచనలలో ఉన్నది. అందుకు కారణం యితని కెక్కువగా తెలిసి ఉండడమే.'

పెద్ద పెద్ద మాటలుగానీ, ధారగా వరువెత్తే శైలిగానీ యితనికి లేదు.

పునరుక్తికి జంకడు, ఎన్ని సార్లయినా చెప్పి వినేవానికి చక్కగా నాటేటట్లు చేయడమే యీాయన ఉద్దేశ్యం.

ఇతని సిద్ధాంతాలను గురించి కొద్దిగా చెప్పవలెనను కున్నా ఒక పుస్తకం కావలెను.

ఇతడు చేసినపని మార్క్సుజాన్ని తత్కాలపరిస్థితులనుబట్టి గతితర్క రీత్యా వికసింపజేసి రష్యాను రక్షించడం.

మార్క్సుజమునేదంతా తెలిస్తేనేకానీ, లెనినిజం తెలు

72



సుకోవడం కష్టం. ఈ రెంటినీకలిపి తొందరలోనే వ్రాస్తాను.

ఇట్టి మహానుభావుని జీవితాన్ని మనం తెలుసుకొన్నా మంటే తమాషాకుగాదు.

ఆజీవితంలోని ఘట్టాలలో అత డేవిధంగా లోకకళ్యాణానికై యెత్తుగడల నుపయోగించినాడో తెలుసుకోవలెను. రష్యా చరిత్రా మన చరిత్రా చాలా విషయాల్లో సరిపోతూంటుంది. ఆ విషయాన్ని దృష్టిలో ఉంచుకొని తరచిచూడవలెను.

అతని మేధాసంపత్తిని ఉపయోగించుకొని వారు ధన్యులైరి. ఆసన్నివేశ పరిశీలన మనకుగూడ దారిచూపవచ్చును.

కావున,

ధన్యజీవి లెనిన్ జీవితపఠనము మన స్వాతంత్ర్య సమరాంగణమున సహాయమొనర్చుగాక.

---



శ్రీ సాధన ప్రెస్, అనంతపురం.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA122B128 |
| పుస్తకం పేరు | లెనిన్ |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 73 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | munisha |
| స్కాన్ చేసినది | Ch.Ramya |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |